Regd No. N. 45 / M 3813

వెల ఒక అణా

గోలకొండపత్రిక

ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౪ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ ఆషాఢ బ॥ ౩ (౨౨-౧౦-౧౩౪౯ఫ.) సోమవారము సంచిక ౨౩

★ చైనా నాయకుని ధీరనిశ్చయము ★

★ హిట్లరుగారి బెదరింపులు ★

# జపాను ఒత్తిడి సఫలమైనది

## మూడు నెలలకాలము బర్మారోడ్డు బంధనము

### చైనా సముద్రతీరమున జపానుముట్టడి

బర్మానుండి చైనాకు ఎట్టియుద్ధసహాయ సామగ్రిగాని పోకుండచేయవలెనని బ్రిటనును కోరుటకు జపాను మంచిసమయము చూచుకొనినది. బ్రిటను జర్మనీతో చావుబ్రతుకులసమస్యయైన యుద్ధములో దిగబడియున్న సమయమున జపాను బ్రిటనుతో మీ కోరికనుబట్టి బర్మారోడ్డును మూసివేయనిచో మీ మా సంబంధములు చెడగలవని బెదరించినది. జపాను బెదరింపులకులొంగుట యిష్టములేకున్నను బ్రిటను లొంగకతప్పినదిగాదు. కుదకు బ్రిటను మూడునెలలపాటు ఆబర్మారోడ్డును మూసివేయుటకు అంగీకరించినట్లు జూలై ౧౮వ తేదినాడు బ్రిటిషుపార్లమెంటు కామన్సుసభలో ప్రధాని చర్చిల్ గారు తెలియబరచినారు. ఈవిషయమై బ్రిటనుకును జపానుకును కుదిరిన ఒడంబడికలోని అంశములను చూచెదము.

హాంగ్‌కాంగ్ నుంచి చైనా ప్రభుత్వమునకు ఆయుధములును, మందుసామానులును పోకుండ గతజనవరినుండియే బ్రిటిషువారు నిషేధమును ఏర్పరచియుండిరి. అదిమొదలుకొని జపానువారు ఏదికూడదనుచున్నారో అట్టిసామగ్రి హాంగుకాంగునుండి చైనాకుపంపబడలేదు. బర్మానుండి ఆయుధములు, మందుసామాగ్రిమాత్రమేగాక పెట్రోలు, లారీలు, రైల్వేసామానులుకూడ మూడునెలలవరకు చైనాకు పోకుండచేయుటకు బర్మాప్రభుత్వమువారు అంగీకరించినారు. బర్మానుండి పంపబడినవస్తువులు హాంగుకాంగునుండికూడ పంపబడవు.

ఇట్టిషరతులకు జపానుతో ఒప్పుకొనుటలో బ్రిటను తనరాజ్యములకు అంటుచేగలిగెడి బాధను చైనాలో జాతీయప్రభుత్వము యెడకలుగగల బాధ్యతనుమరచిపోలేదుకాని, తానుస్వయముగా ఒకయుద్ధములో చేరియుండుటవలన ఈఒడంబడికకు అంగీకరించక తప్పినదికాదనిచర్చిల్ గారు సూచించిరి. చైనా స్వతంత్రముగా నుండవలెనని బ్రిటను కోరికయనిరి. అట్లేజపానుతోకూడమంచి సంబంధములుండవలెననికూడ బ్రిటను కోరుచున్నదనిరి. ఇపుడు బర్మారోడ్డునుపూర్తిగామూసివేసినచో చైనాయెడ బ్రిటనుతనబాధ్యతను తప్పినదగుననియు, అందుచేత్రమూడునెలలపాటుమాత్రమే నిషేధమునకంగీకరించినదనియు చెప్పిరి. యుద్ధముముగిసిసంధికుదిరిన తర్వాత పరస్పరము సమానముగ ఇచ్చిపుచ్చుకొనుపద్ధతిపై బ్రిటను చైనాతో సంధులను మార్చి వ్రాయించుకొనదలచియున్నదని చర్చిల్ గారు చెప్పిరి. జపాను సంపదవృద్ధియు జపానుప్రజలక్షేమమును కాపాడునట్లు చేయవలెనని బ్రిటిషువారి కోరికయనియు, అట్లుచైనాలోను జపానులోనుకూడ బ్రిటనుయొక్క ఈఉద్దేశ్యములు నెరవేరునట్లు చేయుటకై బ్రిటనుతోడ్పడగలదనియు కానియీఉద్దేశ్యములు నెరవేరవలెననిన, యుద్ధముగానియుద్ధముచేపదనని బెదరింపుగ నినిప్పుడుప్రయోజనమనియు, శాంతిమార్గమేమంచిదనియు చర్చిల్ గారు చెప్పిరి.

చర్చిల్ గారు ఈప్రకటనచేసినతర్వాత హార్రుబెలీషాగారు ఈవిధముగా జపాను కోరినసౌకర్యముల నిచ్చుటవలన జపాను బ్రిటనుకు అనుకూలమగునని చర్చిల్ గారికి విశ్వాసము కలిగినదాయని అడిగిరి, అందుకు చర్చిల్ గారు అట్టిఅభయము నొసగజాలనని చెప్పిరి. ఈ ఒడంబడిక కుదుర్చుకొనుటలో బ్రిటనురష్యా, యొక్కయు అమెరికాయొక్కయు ప్రభుత్వముల సైఖరులను మనసులో నుంచుకొనియే యున్నారని చెప్పిరి.

బ్రోచికొని మాదపడువారికి లొంగుటతప్ప మరియొక ఫలితార్థములేని షరతులకు బలవంతముగ చైనాపైపెంపుట బ్రిటనుకు యిష్టములేదని ప్రధానిమంత్రిగారి భావమా? అని నోయెల్ గారడిగిరి. ఈసూచనతో సంతోషముతో ఏకీభవించుచున్నానని చర్చిల్ గారు చెప్పిరి.

ఈ విషయమై కామన్సు చర్చను రాబోవు వారములోగాని, అతరువాతివారములోగాని జరుపవచ్చుననిరి.

చర్చిల్ గారు చేసినటువంటి ప్రకటననే లార్డుహాలిఫాక్సు గారు పార్లమెంటు లార్డులసభలో చేసిరి. ఈ ఒడంబడికను విమర్శించుచు లార్డు అడిసన్ గారు ఇదిచాలా దురదృష్టమైనదని చెప్పిరి. ఈ ఒడంబడికనుగూర్చి రహస్య సమావేశములో పూర్తిగా చర్చసాగించవచ్చునని హాలిఫాక్సు గారు చెప్పిరి

ఈ ఒడంబడికనుగూర్చి జపానుప్రధానపగరమగు టోకియోలో బ్రిటిషురాయబారి సర్ రాబర్టు క్రెయిగీ గారికిని జపానువిదేశాంగమంత్రిఅరిటాగారికిని సంభాషణలింకను జరుగుచున్నపుడే జూలై ౧౭ వ ౧౮ వ తేదీలో బ్రిటిషుపార్లమెంటు లార్డులసభలోను, జూలై ౧౮ వ తేదినాడు బ్రిటిషుపార్లమెంటు కామన్సుసభలోను సభ్యులు ఆసంభాషణల ఫలితమును తెలిసికొనవలెనని ఆతురత జూపుటయేగాక ఈ సమయములో జపానుకు బ్రిటను లొంగకూడదని తమఅభిప్రాయమును వెల్లడించిరి. ప్రభుత్వపక్షమును హాలిఫాక్సు గారును బట్లరుగారును సమాధానమిచ్చుచు పూర్తిప్రకటన చేయువరకు సభ్యులు వేచియుండవలెనని కోరిరి. కుదకు పూర్తిప్రకటనలు చేయబడినతర్వాతకూడ సభ్యుల ఆక్షేపణలు పోలేదుకనుక ఈప్రకటనగూర్చి చర్చకై సమావేశముల నేర్పాటు చేయవలసివచ్చెను.

### అమెరికాఅభిప్రాయము

ఈ విధముగా జపానుకోరికపై బర్మారోడ్డును మూసివేయుటను గూర్చి అమెరికా అభిప్రాయమేమియని పత్రికల విలేఖకులు అమెరికాస్టేటు సెక్రెటరీగారి నడుగగా, వారు అమెరికా ఇట్టిచర్యకంగీకరించదనియు, ఇది ప్రపంచశాంతికి భంగకరమనియు చెప్పిరి.

### చైనా అరణ్యరోధనము

జూలై ౧౫ వ తేదిరాత్రి లండనులో చైనా రాయబారి బ్రిటిషుప్రభుత్వ విదేశాంగశాఖకార్యాలయమునకుపోయి బ్రిటను జాతిసమితిసభ్యులాలుగా నుండుటవల్ల నిర్వహించవలసినవిధికి బర్మారోడ్డుబంధనము విరుద్ధముగానున్నదని, బ్రిటను కిష్టములో నున్నసంగతి చైనాకు గుర్తేకాని, ఇపుడు బ్రిటను పెట్టిన నిర్బంధములవల్ల సిక్ధముగను చైనావిషయములో బ్రిటనువిధానము ఏమాత్రము గాని మారదని బ్రిటను విశదపరచవలసినదనియు గట్టిగా చెప్పిరి.

## చైనాదృఢసంకల్పము

చైనాజపానులకు సంధికుదుర్చు సందర్భములో బర్మారోడ్డు సమాచారమును బ్రిటను తెచ్చిపెట్టుచో బ్రిటను చైనాతో స్నేహమునుమాత్రమే గాక, దూరప్రాచ్యములో తనపలుకుబడినిగూడ కోల్పోగలదుఅని మార్షల్ చియాంగ్ కేషేకుగారు జూలై౧౭వ తేదినాడు చుంకింగ్ లో చెప్పిరి. "బర్మారోడ్డును మూసినందువల్ల దూరప్రాచ్యములో యుద్ధకాలముతగ్గునని బ్రిటను తలచుచో, అట్లుఅదితగ్గక యింకను ఎక్కువ కాలము సాగుటయేగాక, ఎక్కువదూరముకూడ వ్యాపించగలదు. చైనా ఎందుకై పోరాడుచు బాధల ననుభవించుచున్నదో ఆఉద్దేశ్యము– అనగా తన రాజ్యములో ఏమాత్రపుభాగమునుగాని గోల్పోకుండ స్వాతంత్ర్యమును నిలుపుకొనగల్గుట నెరవేరునంతవరకు చైనా ఆయుధసన్యాసముచేయదు" అని వారుచెప్పిరి.

చుంకింగ్ ప్రభుత్వ విదేశాంగ శాఖవారు బర్మారోడ్డు బంధనము నాక్షేపించుప్రకటన నొకదానిని జూలై౧౭వ తేదినాడు గావించినారు, బ్రిటనుచర్య చైనాయొక్క శత్రువునకు సహాయము చేయుట యగుచున్నదనియు, అది చైనాయెడ శత్రుభావమునకే లక్షణమనియు ఆప్రకటనలో చెప్పబడినది.

### చైనా–జపానులకు సంధికుదుర్చు యత్నము

ఇప్రుడు టోకియోలో బ్రిటిషు రాయబారి యాజమాన్యమున చైనాజపానులకు సంధి కుదుర్చుటకై యత్నములు జరుగుచున్నట్లు కొన్ని వార్తలు వచ్చినవి. ఆసంధి యత్నములకు అయిదు అంశములు ఆధారములైయున్నవి. (౧) చైనాదేశము లోపలిభాగమునుండి జపానువారలు వెంటనే వదలిపోవలెను. ఇకసముద్రతీరపు పట్టణములను మూడు నెలలలోగా వదలిపోవలెను. (౨) ఉత్తరచైనాలో జపానుఅధికారము ఉన్న భాగమును చైనా వదలుకొనవలెను. (3) చైనా ప్రభుత్వమునందు జనరల్ వాంగ్‌చుంగ్ వీ గారిని (జపాను అభిమాని ఇతడు) చేర్చుకొనవలెను. (౪) మంచూకో వేరేరాజ్యమని చైనావారు అంగీకరించవలెను. (౫) కోమిన్టర్న్ ఒడంబడికను నిరసించి రష్యావారితో వైరము పెట్టుకొనవలెను.

చైనాజపానులకు సంధి కుదుర్చుటకై యత్నమేదైన జరుగుచున్నదాయని జపాను విదేశాంగ శాఖకార్యాలయపు ఉద్యోగులనడుగగా,వారట్టిదేదియుజరుగుచుండుటలేదుగాని చైనాజపానులక్రొత్తసంబంధములను నియమించుటకై చైనాలో జపాను స్థాపించియున్న వాంగ్‌చింగ్‌వీ గారి ప్రభుత్వముతో రాయబారములు జరుగుచున్నవనియు, చుంగుకింగు ప్రభుత్వముతో విడువకుండ పోరాటము జరుపబడుననియు చెప్పిరి.

### చైనాముట్టడి

జపానునౌకలు కొన్ని జూలై ౧౬వతేది వేకువజామున హాంగ్‌చౌ అఖాతములో చర్యగైకొని కొన్నిదీవులను వశపరచుకొనినవి.

చియాంగ్ ఫూకియన్ రాష్ట్రములలో రేవులనుబంధించివేసినతర్వాత షాంఘాయినుండి నింగ్‌పోకు పోవలసియుండిన విదేశీయులఓడలన్నియు ఆగిపోయినవి. జపానువారు చెసెహై వద్దకు చేరగానే ౧౨విదేశీయులఓడలు బయలుదేరెను, వాటిలో ఒక బ్రిటిషుఓడయుండెను. జపానువారి పహరాఓడల అధికారి ఆవిదేశీయుల ఓడలనాపి పరీక్షించిరి, అన్నిటిని వదలివేసిరిగానీ బ్రిటిషుఓడను ఆపిరి.

జపానువారు వెన్చౌ, విన్గపోర్టను పట్టుకొనవలెనని యత్నించుచుండ చైనావారు పట్టుదలతో ఎదిరించుచున్నారు. జూలై ౧౭వతేది చైనావారు గట్టుమీదినుండి ఫిరంగులనుప్రేల్చి ఒక యుద్ధనౌకను ముంచివేసిరి. మరికొన్ని జపాను నౌకలను పాడుచేసిరి. జపానుఓడలు నిన్గ్‌పో పొర్వరు వెలుపలనేయుండెను. ఈరంగమునకు ఉత్తరమున ఒక చైనాసేనలదళము చియాన్‌టాన్గ్ నది గట్టుమీద హీస్టోసెన్ పట్టణములో చేరగలెను.

జూలై ౧౭వతేదినాడు జపానుసేన హాంగ్‌చే అఖాతపు దక్షిణతీరముమీద చిన్హాయి సమీపమున హుంగ్ క్యాన్ కోటను, చిన్నిపర్వతముపై కోటను వశపరచుకొనెను. ఫూకియన్‌లో హీస్యాయన్ వద్ద జపానుసేనలు దిగుటకు యత్నించగా అవి తరిమివేయబడినవి, స్వాటియావువద్దను, హాన్గ్‌కాంగు రేవువద్దనుకూడ జపానుసేనలు దిగుటకు యత్నించెను. స్వాన్గ్యా పై విమానముల నుండి బాంబులు అపరిమితముగా వేయబడెను.

## జపాను మంత్రివర్గము మార్పు

జపానులో యోనాయి గారి మంత్రివర్గము రాజీనామానిచ్చుటకు జూలై ౧౬వతేది నిర్ణయించుకొనెను. దీనికిముందు సైనికశాఖ సంబంధించిన ముఖ్యులందరును సమావేశమై ఏదోఆలోచనలు చేసినతర్వాత, యుద్ధశాఖమంత్రి ప్రధానమంత్రిగారివద్దకిపోయి నూతనరాజకీయవ్యవస్థ నేర్పాటుచేయవలసిన మంత్రివర్గము శ్రద్ధతో పట్టించుకొనుటలేదు కాబట్టి తాను రాజీనామానిచ్చుచున్నాననిరి, అందుపై ప్రధాని యోనాయి గారు వారిస్థానములోకి వారొకరిని సూచించవలసినదిగ వారినేకోరిరి. యోనాయిగారు అట్లు సూచించమని చెప్పిరి. అందుచే యోనాయి గారు రాజీనామానిచ్చుటకు నిశ్చయించిరి. ఇపుడు ప్రిన్సుకోనాయిగారు ప్రధానమంత్రిగా వచ్చినారు, వారే క్రొత్తమంత్రివర్గము నేర్పరచినారు, యోసూకే మాట్సుఓకా గారు విదేశాంగ మంత్రిగా నియుక్తులైనారు. ఇప్పటి అడ్మిరల్ యోషీడాగారే నౌకాశాఖమంత్రిగానుందురు. లెఫ్టినెంట్ జనరల్ టోజో గారు యుద్ధమంత్రిగా నియుక్తులైనారు. మొత్తముమీద జపాను ప్రభుత్వాధికారము సైనికతత్వముగలవారల చేతులలో పడినది.



### జర్మనీ

జపాను వ్యవహారముతర్వాత జూలై ౧౫వతేదినుండి ౨౦వతేదివరకు వచ్చినవార్తలలో ముఖ్యమైనది జర్మనీవ్యవహారము. జర్మనీకి ఇపుడు బాల్కను ప్రాంతములో కొద్దిచిక్కు వచ్చియున్న సంగతి ఇదివరకు సంచికలలో చూచియేయున్నాము. రుమేనియానుండి రష్యాకు బెసరేబియా, బకోవినాలు ఇవ్వబడినతర్వాత హంగరీ తనకుట్రాన్సిల్వేనియాయున్ను, బల్గేరియా తనకు డోబ్రుజాయున్ను ఇపుడే కావలెనని పట్టుబట్టినవి, వీటిని రాబట్టుకొనుటకై సేనలసన్నాహము కూడ ప్రారంభించెను. హిట్లరు, కౌంట్‌సియానో, హంగరీప్రధాని మ్యూనిక్‌లో మాట్లాడిన తర్వాత ఇపుడు హిట్లరు వారివివాదములను సేనలజోక్యములేకుండ తన మధ్యవర్తిత్వముతో తీర్చుకొనవలెనని సూచించినాడు. అప్పుడే ఈ విధముగా పరిష్కారము కుదుర్చుకొనుటకై రాయబారములు జరుగుచునేయున్నవి.

డోబ్రుజాలను రాష్ట్రములో బల్గేరియావారు ఎక్కువగానున్నారు, మొత్తముమీద రుమేనియాలో ఈబల్గేరియావారు అల్పసంఖ్యాకులు. దక్షిణ డోబ్రుజాలోకి ఇదివరకు రుమేనియాసేనలు పంపబడియుండి మూడువారాలక్రింద తొలగించబడియుండెను. కాని మరల పోయిన ఆయిమరోజులలోతిరిగి రుమేనియాసేనలు ఆప్రాంతములోకి చేరినవనియు, అక్కడఆనేకులు బల్గేరియావారలు అరెస్టుచేయబడుటయు, కొట్టబడుటయు, వారల పంటలు పండకముందే కోసివేయబడుటయు జరుగుచున్నదనియు, ఈబాధలు సహించలేక డోబ్రుజానుండి బల్గేరియావారు బల్గేరియాలోకి వచ్చుచున్నారనియు బల్గేరియాప్రభుత్వమువారు రుమేనియాలో తమప్రతినిధిద్వారా రుమేనియాప్రభుత్వమువారికి తెలియబరచి, ఈ అన్యాయములను తొలగించుటకై కోరినారు.

జూలై ౧౬వ తేదినాడు హంగరీ పార్లమెంటుయొక్క విదేశవ్యవహారాల సంఘమునకు జర్మనీకిపోయి తెచ్చుకొనివచ్చిన వ్యవహారముసంగతి తెలుపుచు హంగరీ విదేశాంగమంత్రి కౌంట్ టుసాకీ గారు హంగరీకి ఇకముందు మంచిరోజులు రానున్నవని స్పష్టముగా కనపడుచున్నదనియు, శాంతియుతములైన హంగరీ ఉద్దేశ్యములను ఎవరుగాని తెలివితక్కువగా ప్రతిఘటించకుండుట మంచిదనియు చెప్పిరి.

రుమేనియావారికి వారిరాజ్యములో ఏమాత్రముగాని భాగముపోకుండ కాపాడుటకు బ్రిటిషుప్రభుత్వము అభయమిచ్చియున్నను, ఆ అభయదానమును రుమేనియాప్రభుత్వమువారు వదలుకొనియుండినసంగతిని ఇదివరలో చూచియుంటిమి. అయినను బ్రిటిషువారు ఇంకను తమఅభయదానమును పాటించెదరాయని బ్రిటిషు పార్లమెంటు కామన్సుసభలో ఒకసభ్యుడు జూలై ౧౭ వ తేది ప్రశ్నింపగా విదేశాంగశాఖ అండర్ సెక్రెటరీయగు బట్లర్ గారు అభయదానపు ఒడంబడికప్రకారము ఇక రుమేనియాయెడ బ్రిటను కట్టివిధిగాని నిర్వహించదగినది లేదనిచెప్పిరి.

### స్వీడను గుండా జర్మనుసేనలు

నార్వేకు జర్మనుసేనలను స్వీడనుగుండా పోనిచ్చుటకు స్వీడను ప్రభుత్వమువారంగీకరించినారు. ఇట్లుపోనిచ్చుటవలన నార్వేసాంతము

(…వ పేజి చూడుము)

# విమానాలనుండి బాంబులు వేయుటలో నాలుగుపద్ధతులు

## ౧ హైలెవెల్, ౨. లోలెవెల్ ౩. డైవ్, ౪. గ్లయిడ్

ఫ్రాన్సు పతనంతో ప్రస్తుతం నేలమీద యుద్ధం ముగిసి ఎంతసేపూ విమానయుద్ధమే సాగుతూవుంది.

జర్మనీ ఇంగ్లండుమీదకు ఇంగ్లండు జర్మనీమీదకు విమానాల్ని పంపి బాంబుల్ని వేయడం ఇప్పుడు అధికతరమైవుంది.

ఈ సందర్భంలో బాంబులు వేసేవిధానాల్ని గురించి తెలుసుకోవడం అవసరం. బాంబులు వేసేపద్ధతులు నాలుగురకాలువున్నాయి. వాటినామాలు వరుసగా: హైలెవల్, లోలెవల్, డైవ్, గ్లయిడ్‌లు. ఇందులో ఒక్కొక్కదానిని గురించి కొద్దివివరాలు ఇచ్చుట తెలుపబడుతున్నాయి.

### హైలెవల్

హైలెవల్ బాంబింగు అంటే బాగా ఎత్తు ప్రదేశంలో ఎగురుతూ బాంబులువేయడం. ఈ విధానంవల్ల బాంబులువేసే విమానాలకు యాంటీ ఎయిర్ క్రాఫ్టుబాధ అంతగావుండదు. అయితే ఈవిధానంలో ఒకచిక్కువుంది. బాంబు పడవలసినప్రదేశాన్ని సూటిగా గురిచేయడం కష్టం. ఏమంటే విమానం పదివేల అడుగుల అనగా ఒకటిన్నర మైళ్లఎత్తు వుంటుంది.

అక్కడనుంచి కిందివస్తువును గురిచూచి దానిమీద బాంబువేయడానికి గాలిఒత్తిడిశక్తిని బాగుగా లెక్కచూచుకోవాలె. గాలిఒత్తిడిశక్తి అంచనాలో ఏమాత్రము పొరపాటువచ్చినా బాంబుపడవలసిన ప్రదేశానికి ౩౦ లేక ౪౦ అడుగులు అటోఇటో పడుతుంది.

అంతఎత్తునుంచి బాంబును సూటిగావేయకలిగాడా. అదికిందపడి చేసేభీభత్సం అంతాఇంతా కాదు.

### లోలెవల్

ఇక లోలెవల్ బాంబింగునుగురించి తెలుసుకుందాము. లోలెవల్ బాంబింగుఅంటే కింద బాగువచ్చి విమానాలనుంచి బాంబులువేయడం.

కింద బాగున విమానాలు ఎగిరించడంవల్ల ఒక పెద్దప్రమాదంవుంది. వానిని బెలూను బారేజీలు అడ్డుకోవచ్చు, లేదా యాంటీఎయిర్ క్రాఫ్టు తుపాకులు వానిని నేలకూలపరచవచ్చు.

ఈ ప్రతిరోధాలను తప్పుకుని లోలెవల్ బాంబువిమానాలు బాంబుల్ని రాలిస్తే వాటి ఫలితంకూడా భయానకంగానే వుంటుంది.

### డైవ్

ఇమీద విచారించతగింది డైవ్ బాంబింగు డైవ్ బాంబింగు అతిభయంకర పరిణామంకలది. లోలెవల్ బాంబింగులోవున్న ఆపాయాలన్నికూడా దీనిలోనూవున్నాయి. గురిమీద సూటిగా బాంబుల్ని గాల్చడానికి ఈవిధానం అత్యంతానుకూలమైంది.

### గ్లయిడ్

ఇక గ్లయిడ్ బాంబింగు గ్లయిడ్ బాంబింగులో బాంబర్లు బాగాపైనించి కిందికివస్తాయి. అలారావడంవల్ల అవి శత్రుదృష్టికి తప్పినడుస్తాయి. ఇదిన్ని ఒకరకమైన హైలెవల్ బాంబింగు లాంటిదే. ఎటువచ్చీ ఈ విధానంలో విమానాలు ఎత్తునుంచి చమత్కారంగా కిందికి జాలువారుతూవుంటాయి.

ఇక బాంబింగులో పగలు, రాత్రిసమయాల్లో ఏమైనా భేదముంటుందా ఆనేప్రశ్న కలగడం సహజం. చంద్రుడు బాగా ప్రకాశిస్తూ అన్నివస్తువులు సమంగా కనిపించే రాత్రులంతప్ప ఇతరరాత్రులందు సూటిగా గురిచూడడం కష్టం.

### దీపాలు

ఎటువచ్చీ తప్పక దీపాలు వుండితీరే వంతెనలు, హార్బరులు, రైల్వేలైనులు, రోడ్లు, ప్రయాణంచేస్తూవున్న ఓడలు నక్షత్రాలకాంతిలోకూడా కొంతవరకు స్పష్టంగానే కనిపిస్తాయి.

ఇక మిగతా గురివస్తువుల్ని చీకటిరాత్రులలో పాక్షిక పట్టాలంటే ఫారభూట్లద్వారా దీపాల్ని దింపాలి. అదీపాలు దిగేసమయంలో గురులను గుర్తించుకొని వాటిమీద బాంబుల్ని వేస్తారు.

---

# కొన్ని పూర్వకాలపు విశ్వాసాలు

మద్రాసునుండి వెలువడు హిందూ అంగ్లదినపత్రికలో వెండూర్ నారాయణ పత్రికలో యం. కృష్ణమూర్తి అనువారు "మొగల్ కాలములోని జైనసంస్కృతి" అనువ్యాసము వ్రాసినారు. అందలి కొన్నివిషయాలు వినోదకరముగానున్నవి. అవేనిగా—

### గ్రంథకాలము

అవి జైనులచే వ్రాయబడినవి. సంస్కృతభాష. గ్రంథముపేరేమో తెలుపలేదు. అదీఅముద్రితము. లింబ్డీసంస్థానములోని సంస్కృత తాళపత్రగ్రంథనిలయములోనున్నది: జహాంగీరుచక్రవర్తికాలములో వ్రాయబడినది. అనగాసుమారు ౩౦౦ ఏండ్లనాటిది.

### విషయము

జైనతీర్థంకరులచరిత్రలున్నవి, జైనకళలు,వృక్షశాస్త్రము స్త్రీపురుష వ్యవహారాలు, యితర విషయాలున్ను కలవు.

### శరీర లక్షణాలు

మనిషికి శరీరములో అయిదు పొడువుగాను నాలుగు చిన్నవిగాను, అయిదు అందముగా ౬ ఎత్తుగాను ఏడు ఎర్రగాను మూడు వెడల్పుగాను ఉండవలెనట.

ఎట్లనగా—

అయిదు పొడవుగానుండదగినవి (౧)చేతులు (౨) కంఠమధ్యభాగము (౩) మోకాళ్లు (౪)ముక్కు (౫)స్తనాల మధ్యభాగము స్త్రీలస్తనాలు రెండును "పరస్పరద్వేషులు"గా నుండవలెనట. అనగా వాటికొనలు రెండును రెండుదిక్కులకు వాలియుండవలెను. మరియు ఉభయస్తనాల మధ్యస్థలము ఎక్కువగానుండవలెను. అట్లుండిన స్త్రీ పతివ్రతయట. ఇక కురుచగా నుండవలసిన అంగాలు (౧)పెండె (౨) ప్రజననము(౩) వీపు (౪) ముంగాళ్లు.

అందముగా సుకుమారముగానుండదగిన అంగాలు

౧, కేశకోనభాగము ౨. వేళ్లు ౩. దంత్రములు ౪. ఎద ౫. ముక్కుదూలము ౬. గోళ్లు.

ఎర్రగా నుండవలసినవి

౧, అరచేతులు ౨, అరికాళ్లు ౩. కనుగొనలు ౪ గోళ్ళు ౫. నాలుక ౬. అంగిలి ౭. పెదవులు.

ఎత్తుగా నుండవలసినవి

౧. (నితంబము) ౨, కడుపు ౩. ఎద ౪.ముక్కుదూలము ౫. భుజాలు ౬. నొసలు.

లోతుగా ఘనముగా నుండదగినవి

౧. ధ్వని ౨. బొడ్డు, ౩: మనస్సు

### పవిత్ర వృక్షాలు

న్యగ్రోధము (మర్రి) శతపత్రము సాలవృక్షము, సరళక, ప్రియంగు, శిరీష, నమజాతి: (జాజిపువ్వులు) పాటల, జంబు, అశ్వత్థ, తిలక అవతంసక, అశోక, చంపక. రసాల మున్నగునవి—

అశోక, చంపక, నాగ, ఉదుంబర,వట, బదరి. తులసి, కదంబ, ఓష్ట అతిపవిత్రమైనవి, నిద్ర మెట్లుపోవలెను

తూర్పుదిక్కు తలచేసి పండుకుంటేమంచిది దక్షిణానికి తలచేసిపండినను, పర్వాలేదు, పశ్చిమానికిచేసిన అపాయం? ఉత్తరానికిచేసిన మరీ అపాయం చావుకూడ త్వరలో ప్రాప్తించవచ్చును.

### కుడి యెడమ

మనిషి తనభార్యను గుర్రాన్ని అంబును ఎడమచేతిచేత పట్టుకోనవలెను. యుద్ధములో శత్రులనుకూడా ఎడమచేతనే పట్టవలెను. దొంగతనానికి, జూదానికి, దానానికి కుడిచేయి ఉపయోగించవలెను.

### గాడిదవద్ద బుద్ధి

మనిషి జంతువులనుండి అనగా సింహమునుండి. ఎంద్రికాయనుండి నేర్చుకోవలెను. గాడిదనుండి మూడునీతులు, కోడినుండి నాలుగు, కుక్కనుండి ఆరు కాకినుండి అయిదు నేర్చుకొనవలెను. సింహమువలె హుషారుతో నడువవలెను ఎండ్రివలె తన అభిప్రాయమును బయలుపడనీయకుండా వర్తించుకోనవలెను.కోడినుండిచీకటిలోనే లేచుట, ధీరుడుగానుండుట, తన స్త్రీలనులో బరచుకోనుట నేర్చుకోవలెను, గాడిదనుండి కష్టాలను ఓపికతో సహించుట, శీతోష్ణములందు సమబుద్ధికలిగి యుండుట, సదా తృప్తిని కలిగియుండుట నేర్చుకోనవలెను. కుక్కనుండి బయలులోజీవించుట, తృప్తి, మెలకువ, శరీర లాఘవము, గురుభక్తి ధైర్యము నేర్చుకోవలెను. కాకినుండి, ప్రేమను రహస్యముగా నుంచుకొనుట, మెలకువ, ఇతరుల నమ్మకుండుట మున్నగునవి నేర్చుకోనవలెను.

---

## హరిజన ప్రియుని ప్రజా సేవ.

**పయోజన పాఠశాలా ప్రయత్నము**

రాయరావుపేట. జమీలపేట యింకొన్ని పట్టి గ్రామములు కొన్ని సాధారణముగా ఆత్రాఫుబల్దాజిల్లాలో మేడిచల్ తాలూకాకు సంబంధించినవైయున్నవి. ఈప్రాంత మున మృగశిరకార్తిప్రవేశమైనప్పటినుండియు అపశేవర్షములు లేవు. ఏదోఒకటి రెండుపర్యాయములు భూమి దడియునట్లు వర్షము కురిసెను. పునాసవిత్తనములు భూమిలోపడవేసినారు. మొలకలు చెల్లినవి. కొన్ని భూమిలోనే ఎండిపోయినవి. బావులలోగూడ చైత్రవైశాఖ మాసములలోనే నీరులేకుండ వున్నది. పశువులకు పచ్చిగడ్డి (౬) పైసలకు గంపచొప్పున కొనివేయుచున్నారు.

ఈప్రాంతమున సామాన్యముగా మాలమాదిగలు మరియు హాలినాలిజేసికొను తెనుగువాండ్లు మొదలగు శ్రమజీవులందరు భూస్వాములవద్ద మరియు సాహుకార్లవద్ద వ్యవసాయ వృత్తిలో రాత్రింబవలు సేవచేయువారు. వీండ్లకు యిచ్చు జీతములు రూపాయాలుకావు బుడ్డెడు మొదలుకొని రెండుతూములవరకు ధాన్యమునే యిత్తురు. అదికూడ ఒకమాసమువడ్లు, రెండవమాసము జొన్నలులేక సజ్జలుయిత్తురు, జొన్నలు సజ్జలు మొదలగు గట్టిధాన్యము సగమేయిత్తురు. అనగా కుండెడుడుయివ్వవలసియున్న అందుకు బుడ్డెడుజొన్నలుయిత్తురు. ముఖ్యముగా సాహుకార్లు మొదలగువారందరు రాత్రింబవలు ఎండవానయనక సేవజేయుబీదలకు పెండ్లిపేరంటములకు మరియు తదితరకార్యములకు ఏమైన నగదురొక్కము తీసికొనినదానికి ఎన్నో మిత్తిలుగట్టి వానిజీవితపర్యంతము వానినికొనినట్లు భీమాచేయుందురు.

జమీలపేటలో శ్రీ కొమ్మిడికన్నారెడ్డి మొకద్దంకొత్వాలి పటేల్దారులు కడుఉదారస్వభావయులు. వీరికిగూడ రెండుమూడుబావుల వ్యవసాయమున్నది. వీరివద్దయున్న మాలమాదిగలు మరియు తదితరులు తనపిల్లలమాదిరి తగురీతి జీతములనొసగుచు పోషించుచున్నారు. వీరు నగదురొక్కము అప్పగాయిత్తురుకాని మిత్తిలులేకుండ వారినిపీడించకుండ రూపాయాలుతీసుకొందురు. గతచైత్రమాసములలో నీటికరువుచే మాలమాదిగలు చాలకష్టములపాలగుటజూచి, ఎవ్వరుగూడ తమతమపాటుబావులలోకి అంటుముట్టుఅని దిగనివ్వనందున, వీరుమాత్రము యీరెండుగ్రామముల మధ్యనయున్న తమస్వంతపట్టాయగు యీసుకబావిని తం తెలుగొట్టించి రెండుగ్రామముల మాలమాదిగలకు నీటిబాధచే అహోరాత్రములు తపించుచున్నవారికి అంటుముట్టు భేదభావమును తొలగించి సదుపాయములు గలిగించిరి. అదేబావిలో వారుగూడ ప్రతిరోజు స్నానముజేయువారు. ఈవిధముగ అంటుముట్టుయనక విశ్వమానవ సోదరప్రేమజూపి ఆదర్శమార్గదర్శకులైనందులకు కడు ప్రశంసనీయులు. ఈరెండుగ్రామముల గ్రామసంఖ్య సుమారు మూడువందలు యుండును. రెంటికిని సంబంధించిన ఒకపయోజనపాఠశాల నేర్పాటుజేయుటకు ప్రయత్నము జేయబడుచున్నది.

## హరిజన పాఠశాల

(ఓ.వి.) ఖమ్మంమెట్టు, జూలై ౧౬

ఈదినము ఖమ్మంమెట్టు. బురదరాఘవపురములో హరిజన సేవాసంఘమువారి యాజమాన్యమున పాఠశాల ప్రారంభింపబడినది. శ్రీయుత పి. రంగాగారిని ఉపాధ్యాయులుగా ఏర్పాటు చేయనైనది, బురదరాఘవపుర హరిజనసేవాసంఘ ఎన్నికలుగూడ యీదినముననే జరిగినవి.

## ఆర్యసమాజ ఉపన్యాసములు

ఖమ్మంమెట్టు, జూలై ౧౫

ప. శ్రీ, కేశవార్యగారు యిచ్చటికి సార్వదేశికసభ ఢిల్లీఅనుమతివచ్చి నేటికిమూడురోజులనుండి యీక్రిందివిషయములపై వరుసగా ఆర్యపల్లి వారిమందిరంలో ఉపన్యసించిరి.

(౧) ఆర్యసమాజమనగా ఏమిటి?

(౨) ఆర్యసమాజనియమములు,

(౩) ప్రపంచంలో ఆర్యసమాజంకన్నయితర యేరాజకీయమతసాంఘిక సంస్థలకు అవసరము లేదు.

ఈమూడురోజులు సభాసదులు క్రమాభివృద్ధిగా సభనలంకరించి ఉపన్యాసములనువిని తాత్కాలికముగా శంకాసమాధానములనుగూడా పొందిరి. మూడవరోజు శ్రీ. పం. పి. యస్. ఆచార్యులుగూడా బెజవాడనుండివచ్చేసినందున, వారునువర్ణాశ్రమ ధర్మములవిషయముపైనవక్తగానుపన్యసించిరి.

శ్రీ. కోమరగిరి నారాయణరావుగారుగూడా వర్ణాశ్రమధర్మములు నీతోద్దేశముపై సభికులఅనుమతిపైన ఉపన్యసించిరి

ఇట్లుఖమ్మంమెట్టునందు మూడురోజులపర్యంతరం ఆర్యసమాజమువారి ప్రచారోపన్యాసములజరిగినపిదప శ్రీ. పండిత కేశవార్యవారి ప్రోత్సాహముపైన ఆర్యసమాజమునకొక తాత్కాలికమైన ఆకృతియివ్వబడెను. అందుకార్యక్రమమును సాగించుకొనుటకై శ్రీ. నర్సింగుప్రసాదుగారు అధ్యక్షులుగను, శ్రీ. కోమరగిరి నారాయణరావు మంత్రిగను ఎన్నుకొనబడిరి–ముందు సరియైన యెన్నికలుజరిగి క్యాబినెటుకును సక్రమాకృతి యొసంగబడును.

ఇట్లు
మంత్రి–ఆర్యసమాజం,
ఖమ్మం.

## ప్రకటించబడని వ్రాతలు

ఈక్రింది విషయాలను గూర్చి మాకువచ్చిన వ్రాతలను ప్రకటించజాలనందుకు విచారపడుచున్నాము:—

౧) కుర్నపల్లి గ్రామస్థునిబందూకు అపహరణము–దానిని తిరిగిఇప్పించుటకు లంచముఅడుగుట. (ఈవార్తవ్రాసినవారిపేరు, ఊరు, టప్పా, తాలూకా జిల్లావివరముగా తెలుపబడలేదు.)

౨) బాల్యవివాహ ప్రభావలన మనజాతిదుర్దశ–(ఈవ్యాసములో అన్నీ ఇదివరకుచెప్పినసమాచారములే. ప్రయోజనము లేనివ్యాసము)

౩) రైతులనుండి యుద్ధనిధికి వసూళ్ళవిషయమై మొఱ–(వ్రాత సరిగా తెలియుటలేదు, వ్రాసినవారిపేరు, ఊరు, టప్పా, తాలూకా, జిల్లా వివరములులేవు.)

౪) బాల్యవివాహనిషేధ శాసనమునకు ప్రతికూల ప్రచారము చేయుచున్న సనాతనులను గూర్చి ఒకచిన్నకథ– (కథలో సారస్యమే లేదు.)

౫) జీవరక్షా ప్రచారకునికి ఆటంకము.

౬) ఎల్లారెడ్డిపేట తాలూకా నాగిరెడ్డిగ్రామపు అల్లరులు.

౭) సూర్యాపేటలో ఒక విచిత్ర సంఘటన (ఇది వ్యక్తిదూషణ.

౮) పాండురంగ భజనసమాజముయొక్క శ్రోత్రి సెక్రెటరీగారి ప్రశంస.

౯) తొలిఏకాదశిపండుగ రహస్యము—(ఇందులో విశదపరచినముఖ్యరహస్య మేమియులేదు.)

౧౦) బాల్యవివాహ నిషేధ శాసనము–ప్రబలను మోసపుచ్చుట–

౧౧) అంబోలుతాలూకాలో ఖాదిలాబాద టప్పాఖానానుగూర్చి టప్పాశాఖవారికి మొఱ,

౧౨) అమ్మపాలెం జాగీరుదారుహత్య(ఇట్టివార్త ఒకటి ఇదివరలో ప్రకటించబడినది.

౧౩) బడిపిల్లవానిపుస్తకముపై "వందేమాతరం" అని వ్రాసినందుకు తండ్రినుండి క్షమాపణకోరుట (ఈవార్తకూడ ఆదివరకే మరొకరిచే పంపబడెను.)

౧౪) సనాతనుల మోసములు.

౧౫) "సంస్కృతభాషను గోలకొండ" అనువ్యాసము చర్చచేసిన నరసింగంగారికిచ్చిన సమాధానము (ఇది ఉత్తరోత్తర సమాధానము)

౧౬) భార్యావియోగము (ఇవిపద్యాలు)

౧౭) నైజాం సబుఇన్స్పెక్టరు పోలీసు దౌర్జన్యము చింతకాని (కోర్లకు కొడ్డిగుడ్లకు. పంపిన "నింసర్కారీ" బిజ్జలను రెంటినైనమాకుపంపితే అవిష యము ప్రకటింతుము.)

# గోలకొండపత్రిక

విక్రమనామసం॥ర ఆషాఢ బ॥ 3

సోమవారము


# ప్రపంచశాంతి

ప్రపంచమంతా ఒకటి కాగలుగునా? మానవజాతి యంతయు పరస్పరప్రేమతో వర్తించుకొనునా? ఈ భూలోకములో ఎచ్చటనూ ఇకముందు యుద్ధాలు లేకుండా శాంతి స్థాపితమగునా? అను ప్రశ్నలు వినోదకరమైనట్టివి. నూటికి ౯౯ మంది ఇవన్నియు ఎన్నడును సంభవము కానట్టివి అని ఎరుగుదురు. కొందరు మహానుభావులు మాత్రము ఇవి సంభవమగునని విశ్వసింతురు. ఈనాడు గాంధీ వంటివారును, రూజువెల్టువంటివారును, హెచ్. జీ. వెల్సువంటివారును ఇట్టి విశ్వాసములకు లోబడియున్నారు ఈ ముగ్గురి చికిత్సలుకూడా పరస్పర భిన్నముగానే యున్నవి. మొత్తానికి వైద్యులు రోగికిత్తమన్నమందును ఒకరి దొకరుపసందు చేయరు. ఇంతలో రోగి పరమపదించేది గట్టిమాట.

అయితే ఈవెర్రి యీనాటివారికే ఒంటబట్టినదని తలపగూడదు. అతిప్రాచీనకాలమునుండియు మహానుభావులు ఎవ్వరెవ్వరి కేమితోచెనోదాని నంతయు బోధించిపోయినారు. భగవద్గీతలో "లోక సంగ్రహము" అనుబోధ అట్టిదే. కాని అది గ్రంథస్థముగానే యుండిపోయెను. హిందువులలో ద్విజాతుల నిత్యపూజలో "లోకాస్సమస్తా స్సుఖినోభవంతు" అని దేవప్రార్థనయున్నది. కాని హిందువులే తమ సోదరహిందువులలో కోట్ల సంఖ్యాకులను నీచముగాను, అస్పృశ్యులనుగాను, వేదబాహ్యులనుగాను పరిగణించి ఒకవిధమగు హింసను గావించిరి. ఇక మంత్రోచ్చారణ మేమి చేయగలదు. ప్రసిద్ధ మతకర్తలలో బుద్ధదేవుడును, క్రీస్తుభగవానుడును, లోకసంగ్రహార్థము బోధలుచేసిరి. మతప్రచారముచేసిరి. కాని అట్టి మతానుయాయులే యీనాటివరకును విశేషముగా లోకవిగ్రహకారకులై విరాజిల్లుచున్నారు. ఇట్టి చారిత్రిక సన్నివేశములను దృష్టిలోనుంచుకొని ఇప్పటి ప్రపంచశాంతియత్నాలనుగూర్చి ఆలోచింతము.

పూర్వము మొదట జేమ్సుఅను ఇంగాండురాజు విపరీతపు తెలివికనపరచి wisest fool in Christendom క్రీస్తులోకములో అతిప్రజ్ఞావంతుడైన మూర్ఖుడు అను బిరుదమును సంపాదించుకొనెను. గతయుద్ధములో అనగా ౧౯౧౪ - ౧౯౧౮ వరకు జరిగిన యూరోపుయుద్ధములో అమెరికా అధ్యక్షుడుగానున్న "విల్సన్" అనువారు తానేమో ప్రపంచాన్నంతా యుద్ధరంతునని బయలుదేరి గొప్పసైన్యముతోను, ధర్మపన్నాలతోను ౧౪ సిద్ధాంతాలతోను యూరోపు రణరంగానికి ప్రయాణము కట్టిరి. అపతిమొక్కలవలె మిత్రమండలివారు విల్సన్‌గారి సిద్ధాంతాలకు నమోనమః అనిరి. "ఇక ప్రపంచంలో యుద్ధంలేకుండా చేస్తానుచూడండి" అని విల్సన్‌గారు సెలవియ్యగానే విత్తం చిత్తం అన్నారు. ప్రపంచంలో ప్రతిజాతికికూడ "స్వయం నిర్ణయసూత్రంము" Self Determinat on వర్తిస్తుంది అనే వరకు స్వాతంత్ర్యము కోలుపోయిన ఆఫ్రికా, ఏషియా ఖండాలలోని బానిస జాతులంతా చేతులెత్తిమొక్కెను అతి ప్రజ్ఞావంతుడు అవతారమెత్తెనా అని పంచఖండాలన్నియు ఘూర్ణిల్లిపోయెను. యుద్ధసమాప్తియయ్యెను వర్సైల్సుసంధి పూర్తియయ్యెను విల్సన్ కోరిన ౧౪ పాయంట్లలో సంఖ్యమాత్రము అక్లే యుండెను. అందలి సిద్ధాంతాలు మాత్రము ఎగిరిపోయెను. ఇంకేమున్నది. జేమ్సురాజువలెనే విల్సనుదొరవారును అపహాస్యానికి పాలైరి.

అటుతర్వాత మహాత్మా గాంధీగారు తమ అహింసాసిద్ధాంతమే లోకానికి శరణ్యమన్నారు. కాని వారెంతగట్టిగాఅహింసనుగూరించిబోధించుచున్నారో అంతగట్టిగా ఇండియాలో హిందూముసల్మానులారీయుద్ధాలును, ప్రపంచములో ఆయుధసామగ్రియొక్క ఉత్పత్తియు జరుగుచున్నవి.

ఇప్పుడు అమెరికా అధ్యక్షులైన రూజువెల్టుగారు రంగముపైకివచ్చినారు. ప్రపంచశాంతికి అయిదే అయిదు చిన్న సూత్రాలు వర్తించవలెను అని వెల్లడించినారు. అవేవనగా

౧. నిర్భయత— ఒకరిపై ఒకరు బాంబులు వేసికొనగూడదు. ఒకదేశాన్ని ఒకదేశము ఆక్రమించుకొనకూడదు అన్నిరాజ్యాలవారునుఆయుధాలనువిసర్జించవలెను.

ఇది సంభవమగునా? ఆఫ్రికా, ఏషియా ఖండాలలో బానిసజాతులకు మోక్షము ఇంతసూక్ష్మములోనే కలదా? ఇంత అగ్గువగా పాలితజాతులకు స్వాతంత్ర్యములభించునా? అబద్ధము!!

౨. వార్తాస్వాతంత్ర్యము—ప్రపంచములో ఏమూలలో ఏమిజరుగుచున్నదో అట్టిదాని నిజమైనవార్తలు అందరికిని అడ్డంకులు లేకుండా తెలియవలెను

ఇది సంభవమైతే కావచ్చును.

౩. మతస్వాతంత్ర్యము—

ఇది ఈనాడుకాకున్న ముందుశతాబ్దములోనైనా అన్ని దేశాలలో సంపూర్ణ విద్యావ్యాపకమైననాడు సంభవమగును

౪ వాక్స్వాతంత్ర్యము—

ఎంతవరకు నిరంకుశత్వపరిపాలనలుండునో అంతవరకు ఇది నామకార్థముగానేయుండును

౫ దారిద్ర్యనిర్మూలనము —

ఆర్థిక స్వాతంత్ర్యముతో ఇది సంభవమగును కాని యూరోపు అమెరికా ఖండవాసులు [illegible] ఆఫ్రికా ఏషియా ఖండాలను [illegible] కొన్నారు [illegible] ఈ ఖండ [illegible] ఎన్నటికిని వదలుకోరు

పర్యవసానమేమన విల్సనువలెనే రూజువెల్టుగారు వెలకిలపడి పరిహాసపాత్రులు కావచ్చును ఏనాడు ఏషియా ఆఫ్రికా ఖండాలు తెల్లజాతుల లోహముష్టినుండి జారిబయటపడునో ఆనాడే [illegible] సిద్ధాంతాలు స్థాపనమేర్పడును. [illegible] ఇట్టి న్యాయసూత్రాలన్ని యు శ్రీరంగనీతులుగానే యుండును.

## ఉన్మాదశాలా నివేదిక

౧౩౪౯ సం॥పు ప్రభుత్వమువారి ఉన్మాదశాలా నివేదిక అందినది. ఇది సకాలములో వచ్చుట ఒక గొప్పవిశేషము. అందులకై నివేదికను వెలువరించిన హాలిన్సుగారికి ధన్యవాదములు.

నివేదికా కాలములో ౪౦౭మంది పిచ్చివాండ్లు ఉన్మాదశాలలో నుండినారు అనగా గతసంవత్సరముకన్న 33 మంది యెక్కువైనారు.

నివేదికా కాలములో వచ్చినవారిలో ౯౨ ముసల్మానులును, ౧౯౨ మంది హిందువులును, ౧ క్రీస్తువును ఉండినారు నివేదికా కాలములో ఈ పిచ్చిశాలపై ౯౯౧౧౮ రూపాయిలు ఖర్చైనవి

## మూడురూపాయీలకు మోక్షము

(స్వ. వి)

మహబూబునగరం, షహరేవరుర

సేనుసాయంత్రి రామమందిరములోశ్రీరామభక్తసమాజము దిక్కునుండి యొకసభ జరిగెను శ్రీజేడ్‌హైదరీ మరియు శ్రీకృష్ణప్రసాదుగార్ల మరణమునకు వారిసంతాపము వెలిబుచ్చిరి

తర్వాత సచ్చిదానంద పరమహంసగారు "సోహం" నుగూర్చి ఉపన్యసించి గురువులేనిదే తానెవరో దేవునికి తనకు ఏమిసంబంధమో తెలుసుకొనవచ్చునని తెల్పిరి.

సోమవారం ౯-౧౦ రోజు శ్రీ స్వామివారు ఏరూరివారితో ప్రతిమనుష్యునితో రుకెవంతున ఫీసుతీసుకొని ఏకాంతస్థలములో ఉపదేశమిచ్చిరి

బాలకృష్ణ ఫోటోగ్రాఫరు తదితరులు కొన్ని వేదాంత విషయములు, తమకనుమానముగలిగినవి శ్రీస్వామిగారితో విచారించబోవ వాటికి సమాధానముచెప్పక పుస్తకములు కరీదుచేయుటకై ప్రోత్సాహపరచిరి. తుదకు పుస్తకములను అమ్ము తనప్రభావమును వెలిబుచ్చుటకై వచ్చినాననిరి వీరియుపన్యాసము గ్రామ్యములోనేయుండెను "వీరికి పైసపై చాలాకాంక్షకలదు పుస్తకములలో ఫోటోయున్న యోగీశ్వరునకు ఈతనికి భేదమున్నది వారిపేరుచెప్పి ఈరీతిగామోసగించి పుస్తకములు అమ్ముకొనుచున్నారు. రూపాయిలిచ్చినవారిని పాదముపట్టనిచ్చును ఇతరుల గదిరించును "అని కిచ్చురకల్లు, ఇప్పటూరు, పాలమూరు, రామాపురప్రజలు అనుకొనుచున్నారు. ౧౦ షహరేవరుకు ఇక్కడినుండి మక్తలుకు పోయిరి

పెద్దఏకాదశి

శ్రీమన్నెముకొండలో ౯౦౦౦జనము

(స వి)

మహబూబునగరము, షహరేవరు౧౦

నిన్న ఆషాఢశుద్ధ ఏకాదశి శ్రీరామభక్తసమాజమువారు రాత్రిగం ౧౧లకు రామమందిరములో భజనచేసి, మన్నెముకొండకు లారీతీసుకొనివెళ్లిరి. అక్కడ చాలాజనము కూడియుండెను వీరుపోయి భజనచేసిరి అంగరు వీరిలోచేరి భజనచేసిరి అగుట్టంతయు ప్రతిధ్వనించెను శ్రీరామస్వామి సేవతీయబడెను ఈదృశ్యము కడువైభవముగా నుండెను రాత్రంతయు జాగరణజరిగెను తెల్లవారువరకు భజన నిరాటంకముగా జరుగుచునేయుండెను ద్వాదశి పారణానంతరముఎక్కడివారక్కడికి వెళ్ళిరి

కమూరిగారు

హైదరాబాదు(దక్కన్)షహరేవరు౧౪

[illegible] విషయ పరిస్థితులను గమనించుటకు [illegible]

## విషాద ప్రకటనము

(స్వ వి) మహబూబునగరం, షహరేవరు౩.

శ్రీయుత బరకత్ రాయె అవ్వల్ తాలుకుదారుగారి అధ్యక్షతన నేడుసాయంత్రి గం॥౫లకు "శ్రీబాలసరస్వతీ ఆంధ్ర గ్రంథాలయము"లో తాలూక్దారుగారు పేష్కారు నందగిరి వేంకటరావుగారు శ్రీ శంకరరావు వకీలుగారు తదితరవకీళ్లు మొత్తముమీద వందజనము సమకూడెను సహాయకార్యదర్శిగారగు నందగిరి వేంకటరావుగారు తాలూక్దారుగారిని ఈ బహిరంగసభకు అధ్యక్షులుగా ఎన్నుకొనిరి ఈక్రిందితీర్మానములు యం. నారాయణరావు వకీలుగారిచే ప్రతిపాదింపబడి మౌ॥ అబ్దుల్లమస్తాని వకీలుగారిచే బలపరుపబడెను పైవారి ఉర్దుఉపన్యాసమును శ్రీ నందగిరి వేంకటరావుగారు తెలుగులో విశదీకరించిరి

౧. లేడీ హైదరీగారు హైదరాబాద స్త్రీలకు విద్యనేర్పించుటకు తగుశ్రద్ధ గైకొనుటయే కాక వారిహక్కులకై మిగులపాటుపడిరి వీరి అకాలమరణము మనసంస్థానమునకు గొప్పనష్టము గల్గజేసెను గాన ఈసభవారు వారిసంతాపమును వెలిబుచ్చుచు వీరిమనశ్శాంతికై దేవుని ప్రార్థించుచున్నారు వీరిసంస్థానములో చేసిపోయిన జీవితకార్యములు ఎల్లపుడభివృద్ధిలోయుండునుగాక.

శ్రీ కిషన్‌ప్రసాదు వైకుంఠవాసిగారి కాలగతి నొందడము మన హైద్రాబాదకే గాక హిందూస్థానమునకుకూడ గొప్పనష్టము కలిగినది హిందూమహమ్మదీయ ఐక్యమత్యమున వీరియందే యగుపడుచున్నది బీదలయందు వీరికి అపార ప్రేమ సాధువులను తనవారిగా చూచుకొనును, దానకర్ణుడన్న ఈతనికేపేరు, సాదృశ్యమునకై వీరి చిన్నప్రేల కౌలుపండినారుంటుట ఈతీర్మానమునుగూర్చ మౌ॥ మొస్తాని వకీలుగారు మిక్కిలి సంతాపమును వెలిబుచ్చుచు ఈ హైద్రాబాదు హిందూమహమ్మదీయ సఖ్యతతోనిలిపిన మహనీయుడే ఇతడు ఇతనిమరణము మనకేగాక, మన రాజునకును ప్రజలకు సంతాప గల్గజేసినది కావున ఈసభవారు వీరిశాంతికై దేవుని ప్రార్థించుటయేకాక వీరికుమారుల బంధువుల ఆయురారోగ్యాభివృద్ధికై వేడుకొనుచున్నారని మాట్లాడిరి.

## నిజామాయుర్వేదసంఘపు తృతీయ వార్షికోత్సవము

(స్వ వి) మహబూబునగరం. షహరేవరు౪

ఈసంఘము నిజాం ఆయుర్వేద సభయొక్క శాఖ ఇది మూడు సంవత్సరము [illegible] శ్రీ వేంకటనారాయణ హకీంగారి కార్యదర్శిత్వముననే జరుగుచున్నది గతసంవత్సరపు వార్షికోత్సవములో తీర్మానించినప్రకారము ఒకటియు అమలుజరుగలేదు మొన్ననే సెక్రెటరీ సంఘము దిక్కునుండి ఒకదుకాణమునుకరీదుచేసి దానిలో కొన్ని ఔషధములుపెట్టి అయ్యప్పగారిని మందు అమ్మకపుదారిగా నియమించి ప్రతిరోజు వైద్యాలయము ౯గంటలనుండి ౧౦ గంటలదాక తెరిచే ఏర్పాటుజేసినారు పదిరోజులనుండి ఈ వైద్యాలయము తెరువలేదు ప్రతివారము సభ వార్షికోత్సవమునకుపూర్వము జరుగుచుండెను. నేడు రేపు సభలుఅవునట్లుగా అగపడుచున్నది. వైద్యపాఠశాల ఇదివరకు ఏర్పాటు కాలేదుకాని తృతీయ వార్షికోత్సవమునుగూర్చి చందాలు ప్రోగుచేయుచున్నారు వార్షిక నివేదిక కూడ ప్రచురింపబడుచున్నది

## కేశవరావు స్మారక పాఠశాల

హైద్రాబాదు(దక్కన్)షహరేవరు౧౪

హైద్రాబాదు వకీలును ఉన్నతన్యాయస్థాన న్యాయమూర్తియునైయుండిన స్వర్గీయ పండిత కేశవరావుగారి స్మారకముగా ఆర్యసమాజమువారిచే [illegible] హైదరాబాదు నగరములో ఒక పాఠశాల ప్రారంభింపబడినది దాని ప్రారంభోత్సవమును గోపాలరావు బూర్గులకర్ వకీలుగారు జరిపిరి దానికిగాను లాహోరుఆర్యదేశికసభవారు ౨౫౦౦౧ రూపాయీలనిచ్చినారు సానికులలో వినాయకరావుగారు ఎక్కువసహాయము చేసినారు ఈసందర్భములో హైకోర్టు న్యాయమూర్తులైన రా [illegible] విశ్వేశ్వరనాథు గారు ఉపన్యసించిరి విశ్వేశ్వరనాథు గారు [illegible] పాయిల చందానురాయగణపతిరావు కిశోరుగారు ౧౨౫ రూపాయీలనుఇచ్చిరి పండిత [illegible] జీగారు వచ్చినవారికి కృతజ్ఞతను తెలిపి అందరును ఈపాఠశాలకు ద్రవ్యసహాయము మీయవలెనని కోరిరి

## హైద్రాబాదు బజారు ధరలు

తేది ౧౫-౧౦-౪౯ ఫ

పల్లా ౧కి ౧౨౦ సేర్లతూకము ధరలన్నీ హాలీకే.

| బియ్యము | పల్లా ౧కి ధర | | |
|---|---|---|---|
| | రూ | అ | పై |
| కిచిడీసాంబర్లు | ౨౧ | ౦ | ౦ |
| సంబర్లు | ౨౧ | ౪ | ౦ |
| ఢిల్లీభోగాలు | ౧౯ | ౦ | ౦ |
| రాంసాగర్లు | ౧౩ | ౧౪ | ౦ |
| జానక్రాం | ౨౦ | ౦ | ౦ |
| అర్కాటి | ౧౯ | ౦ | ౦ |
| కోనామణి | ౧౩ | ౮ | ౦ |
| బుడుములు | ౧౫ | ౮ | ౦ |
| దేశావరి | ౧౫ | ౮ | ౦ |
| గోధుములు | ౧౬ | ౪ | ౦ |
| ఒన్సీ | ౧౩ | ౪ | ౦ |
| లస్కరీ | ౧౬ | ౮ | ౦ |
| పోటియా | ౧౬ | ౦ | ౦ |
| ఎర్రగోధుములు | ౧౪ | ౦ | ౦ |
| జొన్నలు | ౧౦ | ౦ | ౦ |
| తెల్లజొన్నలు | ౧౦ | ౦ | ౦ |
| పచ్చజొన్నలు | ౯ | ౧౦ | ౦ |
| మడికట్టుజొన్నలు | ౯ | ౦ | ౦ |
| సెనగలు | ౧౩ | ౧౧ | ౦ |
| కందులు | ౮-౧౨-౦ నుంచి | | |
| | ౧౧-౦-౦ వరకు | | |
| మినుములు | ౧౩ | ౦ | ౦ |
| అంకలు | ౧౨ | ౮ | ౦ |
| సజ్జలు | ౧౧ | ౦ | ౦ |
| కుసుములు | ౩ | ౮ | ౦ |
| పప్పు | | | |
| సెనగపప్పు | ౧౩ | ౧౨ | ౦ |
| కంది ,, | ౧౫ | ౦ | ౦ |
| సిరిసెనగ,, | ౨౨ | ౦ | ౦ |
| బంక ,, | ౧౧ | ౦ | ౦ |
| మినుప ,, | ౨౪ | ౦ | ౦ |
| పెసర ,, | ౨౦ | ౦ | ౦ |
| బెల్లము | ౧౨ | ౮ | ౦ |
| ఉప్పు | ౧౧ | ౮ | ౦ |
| ఉల్లిగడ్డ | ౩ | ౦ | ౦ |
| మిరపకాయ | ౯౫ నుంచి ౨౫ వరకు | | |
| చక్కెర మణుగు (౪౦ సే) | | | |
| జావా ,, ,, | ౧౮ | ౨ | ౦ |
| బొంబాయి ,, ,, | ౧౫ | ౮ | ౦ |
| మద్రాసు ,, ,, | ౧౫ | ౧౨ | ౦ |
| నిజామాబాదు,, ,, | ౧౫ | ౧౦ | ౦ |
| ఎర్రచక్కెర ,, పల్ల | ౨౫ | ౨ | ౦ |
| దర్గాచక్కెర,,(౪౦ సే) | ౧౬ | ౧౨ | ౦ |
| ఎల్లిగడ్డ ,౧౨సే | ౨ | ౮ | ౦ |
| అల్లం ,, ,, | ౨ | ౮ | ౦ |
| మణుగు ౧౨ సే | | | |
| కొబ్బెర్నూనె | ౪ | ౧౨ | ౦ |
| కుసుమనూనె ,, | ౩ | ౧౨ | ౦ |
| నువ్వులనూనె ,, | ౩ | ౧౨ | ౦ |
| వేరుసెనగనూనె ,, | ౨ | ౧౪ | ౦ |
| పుంటినూనె ,, | | | |
| కిరోసిన్ (గ్యాస్),, డబ్బా ౧ కి | | | |
| తెల్లది ,, | ౪ | ౩ | ౦ |
| పచ్చది ,, | ౩ | ౯ | ౦ |
| నెయ్యి మణుగు ౪౦ సే | | | |
| బిదరునెయ్యి ,, ,, | ౪౫ | ౨ | ౦ |
| తెలంగానా ,, ,, | ౩౩ | ౦ | ౦ |
| వనస్పతి డబ్బా ౧ కి | ౧౧ | ౨ | ౦ |
| బంగారు తు ౧ కి | ౫౦ | ౬ | ౦ |
| వెండి ౧౦౦ తు | ౬౧ | ౮ | ౦ |
| తు ౧ కి | ౦ | ౧౧ | ౬ |
| సవరన్ ౧ కి కల్దారు రూ | ౩౦ | ౦ | ౦ |
| మారకం | | | |
| పోలీసు కి ల్దార్లు | ౧౬ | ౬ | ౦ |
| కి ల్దారుకు హాలీ | ౧౬ | ౮ | ౦ |
| ఆముదాలు బస్తా | ౧౨ | ౨ | ౦ |
| వేరుసెనగ | | | |
| బుడ్డలు పల్లా ౧కి | ౧౧ | ౮ | ౦ |
| పప్పు పల్లా౧కి | ౧౨ | ౦ | ౧ |

గమనిక. —

౧ ధరలు వీలైనంతవరకు సరియైనవిగా తెలుపుచుందుము అయినను ఏమైనపొరపాట్లుండిన దానికి పత్రికవారు బాధ్యులు కారు.

౨ నగరాలలో జిల్లాలలో వ్యాపారపు పేటలలోని గొప్పవర్తకులు తమయొక్క ప్రకటనలు మాపత్రికలో వేసికొనిన వారి వ్యాపారానికి సహాయకారులగుదురు.

# హైదరాబాదు యుద్ధసహాయము

విరాళాలు

మంగళవారము ౧౬ జులైనాటి వసూళ్ళు ౩౮౪౩ హాలీలు ౨౪౧౩ కల్దార్లు అందు ముఖ్యమైనవి.

౧౦౦౦ రూ॥ ఎ. హనుమంతరావు మొదలియారుగారు, ఏ హెచ్. వెంకటరావుగారు

౫౦౦ కైలాస శరభయ్యగారు

౩౦౦ అబుల్ హసన్ సయ్యద అలీవకీలుగారు

పబ్లికువర్క్సు శాఖవారి కచ్చేరీలో ఈ ఫండుకుగాను సహాయముచేయుటకై సభజరిగెను శాఖామంత్రిగారు ఉపన్యాసముచేసిరి వారు బ్రిటిషువారి ఆధిక్యతను గూర్చియు వారి ఉత్తమత్వాన్నిగురించి దీర్ఘంగా ఉపన్యసించిరి ఉపన్యాసానంతరము ఈశాఖలోని ప్రతిఉద్యోగియు తనకు తోచినవిరాళమును ఇయ్యవలెననియు హైగా తనజీతములో రూపాయికి రెండుపైసలప్రకారము ఇచ్చుకొనుచుండవలెననియు తీర్మానింపబడెను. ఇవిచందాలహస్తుకరణ ఇదికాక యుద్ధఋణాలనుకూడ వడ్డీలేకుండా ప్రతివాడును ఏదోకొంత మొత్తాన్ని ఇయ్యవలెనని తీర్మానించిరి. గుత్తేదారులనుగూడ పిలిపించిఒక సభచేయుచున్నారు

౧౭ జులైనాడు ౬౧౪౬ హాలీలున్ను ౪౩౭౩ కల్దారులున్ను వసూలయ్యెను ఈవిధంగా పెతేదీనాటివరకు మొత్తమువసూళ్లు.

హాలీలు ౧౩౪౯౯౨ కల్దార్లు౫౧౨౫౧ ౧౭ జులైనాటి వసూళ్లలో ముఖ్యమైనవి

రూ ౨౫౦౦ రా-సా-జి-అనంతప్రసన్నాథ స్వామిగారు

౧౦౦౦ సిద్ధంసెట్టి రాజేశ్వరరావుగారు (పాతిచందాకాక)

౪౫౦ మాచర్ల శివ చిదంబరయ్యగారు

౫౦౦ ఫీలాఖానగర్ రాజా బిశ్వేశ్వరిగర్జి

౩౧౦ ఆ జేజా నవాబుజంగు బహద్దరుగారు

౧౫౦ యం-హెచ్-గుప్త గారు

హైదరాబాదు సైన్యములోని ముఖ్యాధికారులున్ను సైనికులున్ను వందలువందలుగా చందాలువేసినారు

## హైదరాబాదు స్త్రీలసహాయము

౧౯ జులైనాడు బషీర్ బాగులోనున్నదగ్గర స్త్రీలక్లబ్బులో యుద్ధసహాయకమిటీ జరిగెను హెచ్-హెచ్. ప్రిన్సెసు దుర్రేశెహ్వార్ దుర్రానాబేగంగారి అధ్యక్షతవహించి, గా॥ రెసిడెంటుసతిగారు, ప్రిన్సెస్ నీలోఫర్ గారు సాహిబ్జాదీ సకీసున్నీసా బేగంసాహెబాగారును సభనలంకరించిరి, ఉర్దూమరాఠీ తెనుగుభాషలలోను ఇంగ్లీషులోను ఉపన్యాసాలు జరిగినవి బేగం అలియుద్దీన్లా, రాణీ శ్యామరాజ, వనపర్తిరాణీ కొట్టూసతి, నందీసతి హాలిస్ససతి, ఓఆల్రెడ్డిసతి, అమరచింతరాణీగారలును తదితరులును ఉపన్యసించిరి. యుద్ధములో పాల్గొన్న సిపాయీల సహాయమునకై స్త్రీలు ఏవిధంగా పాటుపడవలెను అనువిషయము ప్రధానమై యుండెను స్త్రీలు మూడువిధములుగా సహాయపడగలరని నిర్ణయించిరి

౧ రెడ్ క్రాసుకు సహాయముచేయుట

౨ అల్లుట, కుట్టుట.

౩ చందాప్రోగుచేయుట

సభ చాలా ఉత్సాహవంతముగాను జయప్రదముగాను జరిగెను

టాకీప్రదర్శనము

దీని సహాయార్థమై, నగరములోని జమ్రుద్ మహల్ లో "జౌరత్" అను టాకీ ప్రదర్శింపబడెను దానినుండివచ్చిన ఒకపూట ఆదాయమంతయు పండుకియ్యబడెను గురువారమునాటిరాత్రి యీవిధముగా ప్రదర్శనమైనప్పుడు ౧౨౦౦ రూపాయిలు వసూలయ్యెను ఆ మొత్తాన్ని ఫండులో జమాకట్టించిరి

౮-౬-౪౦ నాటివరకు వసూళ్లు

౧౪౯౦౧౨ హాలీలు ౨౧౨౭౮ కల్దార్లు

పైతేదివరకు పెండంబాలవసూళ్లు

౪౧౯౪ హాలీ ౩౬౪౯ కల్దార్లు

పైతేదిఅనంతరము నగరమొత్తాలు-జిల్లాలనుండి తాలూకాలనుండి వ్యక్తులనుండి తహశీల్దార్లనుండి న్యాక్షల్లనుండి వసూలైనమొత్తాలు పైపూర్వపు వసూళ్ళున్నుకలసి ౧౭౩౦౭౭ హాలీలున్ను ౨౫౧౧౪ కల్దారులున్ను అయినవి

౧౮ జులై గురువారము నాడు పైనిధికిరవె౧౯ హాలీలు ౫౦౦ కల్దారులు వసూలయ్యెను

ఈమొత్తములో పెద్దమొత్తాలులేవు అన్నీ ౫౦-౨౫-౧౦ రూపాయిల చొప్పువి ఉన్నవి.

## యువరాణిగారి అధ్యక్షతన స్త్రీలసభ

యుద్ధసహాయసంధమై ౧౯ జులైనాడు నగర స్త్రీలవలన జరిగినసభలో శ్రీబిరారు యువరాణీగారు అధ్యక్షతవహించిరి బేగం మెహిదీయార్జంగుగారు ఉపన్యసించిరి, శ్రీ యువరాణీగారి ప్రభావశోభలును ఈ స్త్రీలందరును ఎక్కువ ఆసక్తితో యుద్ధసహాయార్థమై పాటుపడగలరనిచెప్పిరి తుదకు బ్రిటిషువారికి జయముకలుగుటకై ప్రార్థించిరి

తర్వాత శ్రీబిరారు యువరాణీగారిట్లు ఉపన్యసించిరి

"ఈనాడు గొప్పవిపత్తులో మనమిచ్చట కూడినాము ప్రపంచశాంతి, సభ్యతా నాశనమైపోయినది మానవజాతియొక్క స్వాతంత్ర్యమే నాశనమగుచున్నది ఈయుద్ధములో ఒకపక్షమువారు దుర్మార్గులు ఒకపక్షమువారు సర్వాత్ములు, ఈనాడు చిన్నచిన్న దేశాలన్నియు నాశనమైనవి ఒకఇంగ్లాండుమాత్రమే మిగిలియున్నది, ఇండియా యెప్పుడును ప్రతివారికి స్థానము అడుగకొనుమాటిచ్చినట్టి ఉదారదేశము ప్రపంచములో ఏమూలకష్టంవచ్చినా ఇండియా తోడ్పడినది"

పురుషులతోపాటిగా స్త్రీలును తమవిధులను నెరవేర్చవలసివచ్చిన కాలము వచ్చినది ఇండియా స్త్రీలు ఏమాత్రమునూ వెనుకబడకుండా యుద్ధసహాయముచేయుదురని నాకు పూర్తి విశ్వాసముగలదు మన ప్రభువుగారి అడుగుజాడలలో హైదరాబాదు స్త్రీలు నకిల విధిని నెరవేర్చగలరు"

---



## ఆంధ్ర మహాసభ

స్థాయిసంఘ కార్యకారిణీ సభ తీర్మానము

హైదరాబాదు (దక్కన్) షహరేవరు ౧౮

ఆంధ్రమహాసభ కార్యకారిణీ సంఘమువారు హైదరాబాదు హిందూమహాసభయెడ తమవైఖరినిగూర్చి ఈక్రింది తీర్మానమును ఆమోదించినారు

(అ) త్వరలోనే ఈరాష్ట్రమున సమావేశము కానున్న హిందూమహాసభ (హిందూ కాన్ఫరెన్సు) సందర్భమున అధ్యక్షులవారు ఇటీవలచేసిన పత్రికాప్రకటన యొక్క తత్వముతో ఈసభవారు ఏకీభవించుచున్నారు, ఆంధ్రమహాసభ అస్తిత్వములోనికి వచ్చినదాది ఈసంస్థ మత, పాక్షికత్వములేకుండ, నిష్పక్షక జాతీయపు వాదులపై నడచుచున్నందునను, జాతి,మత,వర్గ, విచక్షతలేకుండ తెలంగాణాలో నివసించువారందరికి దీనిలో ప్రవేశమున్నందునను పూర్వపుఉత్తమ సాంప్రదాయములను కాపాడుట విధియైనందున ఈసంస్థయొక్క ఉత్తమరాజకీయ, ఆర్థికాది ఆశయముల సాధనకు హానికలుగకుండుటకుగాను ఆంధ్రమహాసభయొక్క ఎన్నిక సంఘసభ్యులే కాని తత్సంఘములచే నియమింపబడిన ఉపసంఘసభ్యులేకాని, లేక ప్రత్యేకవిషయములను నిర్వహించుటకై నియమింపబడిన వ్యక్తులుగాని, మతపాక్షిక, సంస్థలలో చేరకూడదని ఈసభవారు తీర్మానించుచున్నారు

(ఆ) నేటివరకుఈరాష్ట్రములో నేర్పడిన హిందూప్రజామండలియు, హిందూమహాసభయు, ఇత్తెహాదుల్ ముసల్మీన్ సంఘమును, వాటితత్వమునుబట్టియు, ఆదర్శములనుబట్టియు మత పాక్షిక స్వభావమును కలిగినవని ఈసభవారు అభిప్రాయపడుచు పైసంస్థలు మత పాక్షికసంస్థలని తీర్మానించుచున్నారు

ఎం. రామచంద్రరావు

★

## దేశరక్షణ నియమాల క్రింద అరెస్టు

బొంబాయి, జులై ౧౩

యుద్ధారంభమైనవెంటనే మదరాసు నుండి బహిష్కరింపబడి పనిచేయుచున్న మదరాసు కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కార్యదర్శి శ్రీ జీవానందంగారిని బొంబాయి పోలీసులు అరెస్టుచేసిరి దాదర్ హిందూ కాలనీలో యీతని అరెస్టు చేయబడెను

---

## ఈస్టు ఇండియా ఫండుతో కొన్న ౭ విమానములు

వైమానిక శాఖవారి క్షేష్టపడుట

లండను, జూలై ౧౫.

కలకత్తాలోని ఈస్టుఇండియా ఫండువారు తూర్పుఇండియా లోని అన్నితరగతులు తెగలకు చేరినవారివద్దనుండి విరాళములను ప్రోగుచేసి విమానములను కొనుటకై ఆ మొత్తములను బ్రిటను వైమానికశాఖాధికారుల కొసగిరి. ఇంతవరకు ఈ విధమున ఇవ్వబడిన మొత్తములనుండి వైమానిక శాఖవారు ౭ విమానములను కొనిరి. ఈ మొత్తముతో కొనబడువిమానములు ఈస్టు ఇండియా ఫండు ఫైనల్"అను పేరుతో ప్రత్యేకదళముగ ఏర్పరుపబడును. నేటిదినము సర్ అలెగ్జాండరుమ్యూరే గారు, డేవిడ్ మైరుప్రభువుగారు ఫండువారితరఫున వైమానికశాఖ సహాయమంత్రి కెప్టెన్ బాల్ఫోరుగారిని సందర్శించి ౫౫,౪వేలపౌనుల చెక్కునొసగిరి. బాల్ఫోరుగారు విరాళములకు కృతజ్ఞత తెలిపి విమానాశ్రయమునకు తీసికొనిపోయి, విరాళములతో కొనబడిన రాకొత్త విమానములను వీరికి చూపిరి.

## ఉద్దామసింగు అప్పీలుగతి

లండను, జూలై౧౬.

క్రిమినల్ అప్పీలు కోర్టువారు ఉద్దామసింగు గావించిన అప్పీలును కొట్టివేసిరి.

నిందితునితరఫున వకీలు సెంట్ జాన్ హచిన్సను కె.సి.గారు వాదించుచూ అతడు ఎవరినిగాని హత్యచేయ నుద్దేశింపలేదనియు గాలిలో పిస్తోలుపేల్చి తనఅసమ్మతిని తెలుప యత్నించెనగియు శాస్త్రప్రకారము అతనిఎడ ఆ౦దువల్ల అట్టి నిందలేదనియు, చెప్పిరి.

న్యాయమూర్తి హంఫ్రీగారు అప్పీలును కొట్టివేయుచూ అతడు హత్య గావించెనని జూరీవారికి ప్రబలసాక్ష్యము చూపింపబడెననిరి. జ్యూరీవారు ఇది ఇదివరకే ఆలోచించుకొని తయారైవచ్చి చేసిన ఘోరహత్యయేయని చెప్పియుండిరి. నిందితుడు తనఅసమ్మతిని తెలుపుటకే సభకు వచ్చియుండినచో వారు ఎంతమాత్రము మెదపక పోవుటకు కారణమేమి హత్యచేయుటచే తన అసమ్మతిని ఒకవిధముగ తెలుపవచ్చుగాని అదిచాలా అవివేకమైనట్టియు, దుర్మార్గమైనట్టియు చర్యయే అగుననిరి.

## చెవులులేవు- కాని చెవుడులేదు

ముక్కుతోవినే వింతవ్యక్తి

పెషావరు, జూలై౨౦

హిరట్ వద్ద పయాన్ కల్లాహిరా అనే గ్రామవాసి అబ్దుల్ రహమాన్ కుమారుడు నజార్ మహమ్మద్ అనువాడు పుట్టుకతోనే చెవులులేకుండాపుట్టెను, చెవులేకాదు కర్ణరంధ్రాలుకూడ లేవు. అయినా ప్రతిశబ్దమూ చక్కగా వినిపించుచున్నది.

హిరట్ లో డాక్టరులంతా ఈమనిషిని పరీక్షించి, చెవులు లేకపోయినా, చెవులపనిముక్కు నిర్వర్తిస్తున్నదని తేల్చిరి.

## ఆహింసచెల్లని సందర్భము

కాంగ్రెసు సభ్యులలో వివరణము

ఇటీవల కాంగ్రెసు కార్యసంఘమువారు దేశములో అరాజకపరిస్థితుల నెదుర్కొనుటకు గాని, బయటినుండి శత్రువుచేయుదాడి నెదుర్కొనుటకుగాని అహింస నుపయోగించు విషయములో తమకు విశ్వాసములేదని తీర్మానించి యుండిరిగదా! దానియర్థమును కాంగ్రెసుకార్యదర్శి ఆచార్య కృపాలినిగారొక సభ్యులకు లేఖ వివరించినారు. దేశములో సివిలుఉద్యోగుల పరిపాలనవ్యవస్థ నశించి అల్లకల్లోలముగానున్న సందర్భమునకు మాత్రమే కార్యసంఘమువారి క్రొత్తతీర్మానము ఉద్దేశించబడినదని అందులో స్పష్టముచేయబడినది.

## మహాభారత కాలంనాటి సంఘటన మళ్లీ ఈనాడు తటస్థించినది

భూమి బద్దలయింది

ఏమికీడు మూడుతుందో!

గోరక్ పూర్ కి పశ్చిమాన ౧౨ మైళ్ల దూరంలోవున్న "గాక్సారా" గ్రామంలో ఇప్పుడొక చిత్రాతిచిత్రం జరుగుతున్నది. దాన్ని చూడటానికి లక్షలాదిప్రజ తండోపతండాలుగా ఎగబడుతున్నారు.

గాక్సారాగ్రామపు ఒకతోటలో భూమి ఒకచీట వేయడం కొందరి కళ్లబడింది. మొదట్లో ఆచీలిక ఎంతోలేదు. కాని, అదిక్రమంగా విరివిఅయి, ఈరోజున అది ఒకఅడుగువెడల్పు బీటగా వృద్ధిపొందింది. మరి, దానిలోతు ఇంత అని ఒకళ్ళూ నిర్ణయించలేకున్నారు.

దీనిమాట అట్లావుంచి, గతపక్షములోతిథుల లోపరిగణించగా ౧౩ రోజులుమాత్రమే లెక్కకువచ్చినవి. ఈమాదిరి తక్కువదినాలు అలనాటి మహాభారత కాలంనాడు మాత్రమే ఒక్కసారి వచ్చినట్లు తెలుస్తున్నది.

ఈసూచనలవల్ల ఏవోకొన్ని ఉపద్రవకరములైన ఆపదలు సంభవింపనున్నట్లు చాలమంది భయపడుతున్నారు

## దానిమ్మనుండి రంగుల ఉత్పత్తి

పారిశ్రామిక పరిశోధకుని సూచన

కలకత్తా, జూలై ౧౭

దానిమ్మపండు రసమును దేశీయరంగులు చేయుసూచన అమలుపరుపబడునో దానిమ్మపండ్ల ఖరీదుపెరుగుట నిశ్చయము, ముఖ్యమైన పనులకు "మినరల్ ఖాకీని" ఉంచుకొనవలసియుండుటచేత దేశీయరంగులను దానిస్థానే నుపయోగించువిషయము పరిశీలింపబడుచుండెనని ఇండియా ప్రభుత్వమువారి బట్టలమిల్లుల డైరెక్టరు మిల్లులవారికి తెలియజేసెను. దానిమ్మరసముతో మినరల్ ఖాకీస్థానే ఉపయోగపడువస్తువును చేయుటకు సైంటిఫిక ఇండస్ట్రియలుబోర్డు డైరెక్టర్ భాట్ నగర్ గారొకవ్యాసము వ్రాసిపంపిరి.

## ఆంధ్ర స్త్రీల పాటలు

దేవేంద్ర సత్యార్థిగారు ౧౯రజూలై హిందూ పత్రికలో "భారతమాత గానస్వనము"అనువ్యాసములో ఇతరప్రాంతాల స్త్రీలపాటలను గురించి చర్చించుచు ఆంధ్ర స్త్రీలలో ప్రచారమందుండుపాటలనుగురించి యిట్లువ్రాసినారు.

"ఆంధ్ర స్త్రీలు పల్లెపాటలకుచేసినసేవ అపారమైనట్టిది. "ఊర్మిళాదేవినిద్ర" "లక్ష్మణదేవర నవ్వు"అను స్త్రీలపాటలు నిజముగా భారతీయ గ్రామ్య గీతములలో రత్నములవంటివి. "స్త్రీల పాటలు"అని వ్యవహారముతో ప్రఖ్యాతిగాంచిన పాటలలో చాలాపాటలు పెద్దవిగా నున్నవి. అవి మతసంబంధమును సాంఘికసంబంధమును కలవైయున్నవి. తుమ్మెదపాటలుఅను పేరుగలవి గాలాకలవు, దసరా దినాలలో ముఖ్యముగా హరిజనస్త్రీలు ఈపాటలను పాడుకొనుచు ఇంటింటికి బిచ్చానికై బయలుదేరుదురు. ప్రతిపంక్తి తుదిలో "తుమ్మెదా"అను సంబోధనతో యీపాటలుకూడియుండును. ఈ పాటపాడు స్త్రీ తుమ్మెదవలెనే ఝుంకారధ్వని చేయుచు అందముగా పాడుచుండును. ఒక తుమ్మెదపాటలో గౌరీకల్యాణము ముచ్చటకలదు. గౌరమ్మనువివరికిత్తునాఅని ఆమెతల్లి విచారించుచుండును. ఆ పాటలో ఈక్రిందిభావములను తల్లి ఈ ప్రకారం వెలిబుచ్చుచు పాడుసుంది.

"దక్షిణాయంలో ఉత్తరకార్తిలో దక్షప్రజాపతిభార్య ౧౦౧మందిబిడ్డలను కన్నది. అందరికినీపెండ్లిఅయిందికాని శివుఁడిమిగిలిపోయిరి. ఇద్దరినిఒక దేవతకుఇద్దరిని వాయుదేవునికి ఇద్దరినిఅగ్నిదేవునికిఇచ్చిరి. ఇక గౌరిఒక్కతేమిగిలింది. ఓ గౌరీ నిన్నెవరికిత్తునమ్మా?బాపనయ్యలఇంట్లకిచ్చిదేవాసమాట్లాడితే చన్నీళ్ళలోమునుగుతారు. ఆ పాడు చలిస్నానాలు నీవుచేయలేవమ్మా. కోమటికిత్తమంటే వారు ఎప్పుడు అనుచారచేత పసుపుదంపుకొను చేయిస్తారు. కమ్మవాండ్లంటే మాలకూలీలకు దినమూ వడ్లుకొలిపిస్తారు. జంగమయ్యకిత్తునేమేనిన్ను- ఈకడపటిపాట ఆనేవరకు గౌరమ్మ పట్టరానిఆనందముతో నవ్వింది"ఇట్టి పాటలను తెలుగు స్త్రీలు అపారముగా పాడుతూ ఉంటారు,

## మహాత్ముని శిలావిగ్రహం

బొంబాయి మ్యూజియంలోనుంచుట

సిమ్లా జూలై౧౫

సి.రిడను క్లేరుకన్య నిర్మించిన గాంధిమహాత్ముని శిలావిగ్రహమును యీనెల ౧౬౼వ తేదీనుంచి బొంబాయిలో వెస్టెర్నుఇండియా ప్రిన్సుఆఫ్ వేల్సు మ్యూజియంలో వుంచుతారు. దీనినందరూ చూడవచ్చును.

## చియాంగ్ కేషేకు సతిగారిలేఖ

శ్రీమతి విజయలక్ష్మిగారికి ఆహ్వానం

అలహాబాదు, జూలై ౧౫

"మీరున్ను మీప్రతినిధివర్గమువారంతయున్ను చీనాకు రావలెనని చీనాలో యావన్మంది స్త్రీలపక్షమునను నేను సంతోషపూర్వకంగా మిమ్ములనందరినీ ఆహ్వానిస్తున్నాను జపానువారి విమానాలు పట్టపగలు రెలుతురు చాలాబాగుగా వున్నప్పుడుకూడా నిరపరాధులైన ప్రజలమీద సైతము బాంబులను వేస్తున్నారు కనుక మీరందరూ అక్టోబరులోగాని నవంబరులోగాని రాగోరుతాను."అనుచూ డిక్టేటర్ మార్షల్ చియాంగ్ కేషేకుగారి భార్య శ్రీమతి విజయలక్ష్మి పండిట్ గారికి వ్రాసినారు, ౧౯౪౦ జనవరిలో అలహాబాదులో భారత మహిళాసభ జరిగినప్పుడు భారత స్త్రీల ప్రతినిధివర్గమును చీనాకు పంపవలెను అనుతీర్మానము ఆమోదించబడెను. ఈసంగతి షేకుసతిగారికి తెలుపబడినందున ఆమె యీలాగు శ్రీమతి విజయలక్ష్మిగారికి వ్రాసినారు.

## స్త్రీహత్యాపరాధి యొక్క ఇంకొక నేరము

(స్వ. వి.)

జనగామ, జూలై ౧౫

దీనికంటె పూర్వపు గోల్కొండ పత్రిక సంచికలో స్త్రీహత్యాపరాధి పట్టుపడుటయన్న మహబూబునగర వార్త చదివియుంటిమి, ఆహత్యాపరాధియే ఇక్కడ గోపిలాలుఅను మార్వాడి యువకుని చంపియుండెనట. వీనిని మహబూబు నగరునుంచి ఇక్కడికిపట్టి తెచ్చిరి ఇతనినిఅమీనుగారు నీవే నామార్వాడీహత్య చేసినదిఅని అడుగగా వీడు నేనేహత్యచేసినది మరియు అతనిని హత్యచేసిన తర్వాత కత్తి, నెత్తురుబట్టలు భావిలో వేసితినని చెప్పెను, ఆదేతీరుగా కత్తి నెత్తురుబట్టలు భావిలో దొరికినవి ఇప్పుడువీనిని రిమాండునందుంచినారు.

## హైదరాబాదు పురపాలకసంఘము

రాత్రిపాఠశాలలు

హైదరాబాదు(దక్కను)షహరేవరు ౧౧

హైద్రాబాదు నగరములో పురపాలకసంఘమువారు (సఫాయి)వారు ప్రతిసంవత్సరము ౧౫౬౦ రూపాయిలు రాత్రిపాఠశాలలపై వ్యయముచేయుటకు అంగీకరించి నిర్ణయించిరి. ఇప్పుడు నగరములో సఫాయివారు ౬ రాత్రిపాఠశాలలను నడుపుచున్నారు.

## హిందూ కాన్ఫరెన్సు

హైదరాబాదు(దక్కను) షహరేవర్ ౧౧

హిందువుల ప్రథమకాన్ఫరెన్సు ౨౬, ౨౭, ౨౮ జూలై తేదీలకు జరుగును. స్థలము వివేకవర్ధనీ హైదాసమునిర్ణయింపబడినది. ఎల్లరు అధికసంఖ్యయందు విచ్చేసి హిందూజాతి గౌరవమును నిలుపుడు.

సంస్థానమునగల మండలిశాఖలద్వార అధిక సంఖ్యయందు ప్రతినిధులును, ఆహ్వానసంఘసభ్యులగ పంపగలరని, కార్యకర్తలతో ప్రార్థించుచున్నాము.

కార్యదర్శి.

## ఖాక్సారుల ప్రచారము

హైదరాబాదు (దక్కను), షహరేవరు ౧౪

హైద్రాబాదు ఖాక్సారుల సహాయ సేనా నాయకుడు (డిపుటీ కమాండర్) అయినఅబ్దుల్ ముక్తదర్ ఖాన్ అనేవారు హైద్రాబాదు నుండి జిల్లాలలో అనగా నిజామాబాదు, పర్భనీ, జాల్నా, నాందేడ్, ఔరంగాబాదు ప్రాంతాలలో ప్రచారముచేసి ఈరాష్ట్రములోని యీ ఖాక్సారు ఉద్యమానికి బాగుగా పుష్టికలిగించుటకై పర్యటనము చేయుచున్నారు.

## ౨౫ కొమ్మల తాటిచెట్టు

(ఉ. వి.) వేంసూరు. ౮-౧౧-౪౯

వేంసూరు శివారు వర్లపాడు గ్రామంలో కరోడ్డిరీ నాకొకు తూర్పుదిక్కున ఫర్లాంగులో పల నొక తాటిచెట్టుకు మూడు పెద్దకొమ్మలును వాటికి మరల పాతిక చిన్నకొమ్మలును వున్న కొమ్మలును వున్నవి. యీచిత్రమును చాలామంది ఆశ్చర్యముతో వచ్చి చూస్తున్నారు.

## భూరి విరాళము

మా వేంసూరు గ్రామంలోని శ్రీవేణుగోపాల కృష్ణ పుస్తక భాండాగారానికి శ్రీ మోట పోతుల వీరస్వామిగారు లోకల్ఫండు బంగ్లా కెదురుగానున్న తమ స్వగృహమును సదరుగ్రంథాలయానికి శాశ్వతవిరాళముగా నొసగి దానపత్రమును వ్రాసిఇచ్చిరి. గ్రంథాలయము నందులో ప్రవేశపెట్టి కార్యక్రమము జరిగించుచున్నాము. మా గృహదాతఅభీష్టములు పండుగాక.

## జిల్లా యుద్ధసమితులు

హైదరాబాదు (దక్కను)జూలై ౧౯౪౦

హైద్రాబాదు ప్రభుత్వపు భూవ్యాదాయ శాఖవారు రాష్ట్రములోని అన్నిజిల్లాలలోను యుద్ధసమితులను ఏర్పాటుచేయుటకుగాను ఆజ్ఞలిచ్చినారు. ప్రతిజిల్లాసలములోను తహసీలులోను ఒకసమితియుండును. జిల్లాసమితి కధిపతి తాలూక్దారున్ను తాలూకాసమితికి తహసీల్దారును ఉండగలరు. వాడపెద్దలు (మీర్ మొహల్లాలు) ఎచ్చటెచ్చటనుందురో అచ్చటచ్చట వారిని తగినట్టివిధముగా సేవలోనికి తీసుకొనవలెను ఈసమితుల ముఖ్యవిధులేవనగా

౧. యుద్ధకారణములు, ఉద్దేశాలు సరియైన ప్రజలకు తెలుపవలెను. అబద్ధంవార్తలను వెల్లడిచేయవలెను.

౨. హైద్రాబాదు యుద్ధనిధికి చందాలు వసూలుచేయవలెను, వీలైనంతవరకు జనులు నెల చందాలిచ్చేటట్లు ప్రోత్సాహపరచవలెను.

౩ ప్రజలున్ను ఉద్యోగులున్ను తాముసంపాదించి మిగిలించుకొన్న ద్రవ్యాన్ని ఇండియా సంరక్షక నిధిలోనికిచ్చునట్లుగా ప్రోత్సహించవలెను. ఒక్కొక్కటి ౧౫౦౦౦ మొత్తమువరకు వడ్డీనిచ్చే యుద్ధఋణపత్రాలను కొనవచ్చును ప్రభుత్వమువారు వడ్డీలేకుండానే ౫౦లక్షలు యుద్ధఋణమిచ్చినారు. ఈనిదర్శనాన్ని ప్రజలుకూడ అనుసరించవలెను.

## స్వాతంత్ర్యమును గురించిన కొన్ని సుభాషితములు

౧. None is to bo deemed free who has not perfect self command-Greek.
సంపూర్ణాత్మనిగ్రహము లేనివారు స్వేచ్ఛాజీవులుగా పరిగణింపబడజాలరు.

౨. *To speak his thoughts is every man's right*- Greek,
తనభావాలను వ్యక్తపరచుటకు ప్రతివానికిని అధికారముకలదు,

౩. Who has lost freedom has nothing else to lose-Swedish.
స్వాతంత్ర్యము కోలుపోయినవానికి మరేమియు కోలుపోదగినది లేదు.

౪. The good man alone is free: and all bad men are slaves-maxin of the Stoics.
సత్పురుషుడే స్వతంత్రుడు మన్మార్గులందరును దాసులే.

౫. The most magnificient palace would appear to him a Prison who was confined to it- Turkish.
స్వేచ్ఛలేకుండిన మహాసౌధరాజముకూడ చెరసాలవలెనుండును.

౬. None are more hopelessly enslaved than those who falsely believe that they are free-German.
ఎవ్వరైతే అజ్ఞానంతో తాముస్వతంత్రులమని భావించుకొంటారో అంతకంటే ఎక్కువైన దాసులుమరిఉండరు.

౭ In a free country there is much complaint with little suffering in a despotism much suffering but little complaint-Gile's proverbs.
స్వతంత్రదేశములో ప్రజలకు కష్టాలు తక్కువ మొరలుమాత్రం ఎక్కువ. నిరంకుశ రాజ్యాలలో కష్టాలుఎక్కువ-కాని మొరలేవిన్నీ వినబడవు.

## సానుభూతి సభ

సికింద్రాబాదు, జూలై౧౬

బ్ర.శ్రీ. కే. రామమూర్తిపంతులు బి.ఏ. ఎల్.ఎల్.బి. గారి అధ్యక్షతన నేడిచట జగద్గురు పుష్పగిరి శాంకర పీఠాధిపతులుగనుండిన శ్రీమదభినవోద్దండ విద్యాశృసింహ భారతీ స్వాములవారి నిర్యాణమును గూర్చి సానుభూతిసభ జరిగినది.

వారాయణంరాజనరసింహశాస్త్రి, జాగర్లపూడి అమరనాథశాస్త్రి, వేలూరి వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి, చిల్లసుబ్బరాయ సిద్ధాంతి, ప్రభాకర ఉమామహేశ్వర పండితుగార్లు

శ్రీవారి ధర్మరక్షణాసక్తిని గూర్చి ఉదారస్వభావమునుగూర్చియు గంభీరముగ నుపన్యసించి జగద్గురుత్వమున నెట్టిదో విశదీకరించిరి. ఈక్రింది తీర్మానము ఏకగ్రీవముగ నామోదించబడెను.

"ధర్మ సంబద్ధకంకణులును మహోదారచరితులునగు శ్రీజగద్గురు పుష్పగిరి శాంకర పీఠాధిపతులగనుండిన శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యేత్యాది బిరుదావళీ విరాజితులగు శ్రీమదభినవోద్దండ విద్యాశృసింహ భారతీస్వాములవారు భౌతికశరీరమును పరిత్యజించి బ్రహ్మీభూతులైరనివినుటచే మాకుగల్గిన విషాదమునకు మేరలేదు. భారతదేశమునందలి ధర్మోద్ధరణోద్యములలోను వారితోడ్పాటు ప్రధాన స్థానమును వహించుచుండెను. శ్రీవారి నిర్యాణమువలన ధార్మికలోకమునకు తీరనినష్టము వాటిల్లినది. కావున నిచటకూడిన మహాసభలోని మేమందరము శ్రీవారి నిర్యాణమువలన ధార్మికలోకమునకు తీరనినష్టమువాటిల్లినది కావున ఇచట కూడిన మహాసభలోని మేమందరము శ్రీవారి నిర్యాణమునకు విచారపడుచుంటిమి. శ్రీవారివలెనే వారిస్థానము నలంకరించిన శ్రీమదభినవోద్దండ విద్యాశంకర భారతీస్వామివారును ధర్మరథసారథ్యమును నిరంతరాయముగ జరుపగలరని యాశించి యీ సభ శ్రీశ్రీ స్వాములవారికి సర్వతోముఖముగ ప్రణామములు ఆచరించుచున్నారు.

## జిన్నా గారి విధానముపై అసంతృప్తి

ముస్లింలీగు సభ్యుల రాజీనామాలు

కాంగ్రెసు అధ్యక్షులగు మౌలానా ఆజాదు గారి తంతికి జిన్నా గారిచ్చిన సమాధానములో గల నిర్లక్ష్యవైఖరికి అగ్రహించి ముస్లింలీగు సభ్యత్వమునుండి మౌలానా హుజైన్ మొహని గారు రాజీనామానిచ్చినట్లు తెలియుచున్నది.

దేశమంతటను పలువురు పక్కాజాతీయవాదులుకాని ముసల్మాను ప్రముఖులుకూడ జిన్నా గారి వైఖరికి ఆక్షేపణలను వెల్లడించుచున్నారు.

వాకొంటి రాష్ట్రప్రభుత్వములు ఏర్పరచిన యుద్ధసంఘములలో ముస్లింలీగు సభ్యులు చేరకూడదని ముస్లింలీగు గావించిన తీర్మానముపై యుద్ధసంఘములలో చేరియుండిన ముసల్మానుల అసంతృప్తి. పంజాబు రాష్ట్రీయ ముస్లింలీగు కార్యనిర్వాహకవర్గమువారు పంజాబు మాత్రము ముస్లింలీగు తీర్మానపు నిర్బంధమును లేకుండచేయవలెనని వదనికొనుటకై జిన్నా గారివద్దకి కొందరు రాయబారులను పంపుటకు తీర్మానించుకొనినారు. సంయుక్తరాష్ట్రములో ఝాన్సీ యుద్ధసంఘములో సభ్యులుగాచేరిన ఖాన్ సాహెబ్ మహమ్మద్ రఫీక్ గారు ఝాన్సీ ముస్లింలీగు అధ్యక్షత్వమునకు రాజీనామా నిచ్చినారు. లీగువిచిత్రమైన పరస్పర విరుద్ధలక్షణముల మాటలాడెనన్నదని వారు చెప్పినారు. లీగుఎన్నికల సమయమున ప్రచారమునకు ఉపయోగించు వేదికతప్ప, అంతకంటె ఎక్కువగాని తక్కువగాని దానిలో నేదియు లేదనినారు.

హైదరాబాదు (దక్కను) లో డాక్టర్ లతీఫ్ సయ్యద్ గారు మౌలానా ఆజాదుగారికి జిన్నా గారిచ్చిన సమాధానపు వైఖరికిమూల పరితపించినట్లు ప్రకటన చేసినారు.

## ముస్లింలీగు నాయకునిరాక

హైదరాబాదు (దక్కను), షహరేవరు ౧౪

అయోధ్యాపరగణాలోని ముస్లింలీగు సంఘానికి అగ్రనాయకులైన నవాబ్ మహమ్మద్ ఇస్మాయిల్ ఖాన్ అనువారు హైద్రాబాదుకు గతబుధవారము వచ్చినారు. హైకోర్టు న్యాయమూర్తులైన మహమ్మద్ ఖలీలుజమా సిద్దీఖీ గారి అతిథిగావారి బంగ్లాలో దిగినారు.

కచ్చుగారు

ద్వారకనాథ్ కచ్చుగారు నిజామాబాదు లోను బోధన్ లోను పర్యటనముచేసి హైద్రాబాదుకు తిరిగివచ్చినారు.

## ఆంగ్ల నౌకా విఘాతములు

పూర్వముకంటె హెచ్చినట్లు నౌకాశాఖవారి ప్రకటన

లండన్, జూలై౧౬

జూలై ౫వ తారీఖు అర్ధరాత్రితో నంతమొందు వారమునందు బ్రిటిషు మిత్రమండలి తటస్థ రాజ్యముల నౌకలన్నియుకలిసి ౭౭౩౯౯ (?) టన్నుల పరిమాణముకలవి నష్టమైనట్లు నౌకాధికారులు ప్రకటించుచున్నారు. వీనిలో ౧౫ బ్రిటిషువారివి. ౫మిత్రమండలివారివి ౬తటస్థదేశముల వారివి. అంతకు పూర్వము వారముకంటె విమానదాడులు హెచ్చుటచేతను, తీవ్రమగుటచేతను నష్టములు క్రిందటివారముకంటె హెచ్చు నౌకానష్టములు జలాంతర్గాముల చేతను, విమానముల చేతను కలుగుచున్నవి. జలాంతర్గాములును విమానములును ఎక్కువచురుకుగా పని చేయుచో ఎక్కువనష్టము. తక్కువచురుకుగాపనిచేయుచో తక్కువనష్టముకలుగును జర్మనీవారు ఫ్రెంచితీరమునాక్రమించుకొనియుండుటచేత నికమీద నౌకావిఘాతములు హెచ్చువచ్చునని ప్రకటన తెలుపుచున్నది.

# కమ్యూనిస్టులపై పంజాబు ప్రభుత్వ చర్యలు

## చర్చించుటకు అసెంబ్లీ రహస్య సమావేశము

లాహోరు, జూలై ౧౫

నేడు పంజాబు అసెంబ్లీ రహస్య సమావేశములో ప్రధాని సర్ సికిందర్ హయాతుఖాన్ గారు ప్రతిపాదించిన తీర్మానమునెగ్గెను. ఇండియా సైన్యములో చాలమందిని పంజాబురాష్ట్రము సప్లయి చేయుచుండుటవలను, పంజాబురాష్ట్రముమీద శత్రువు దాడిచేయు అవకాశము లేకపోలేదు గనుకను, పంజాబులో అంతశ్శాంతి రక్షణ అల్లరులు లేకుండచేయుట ఎంతో అవశ్యకమనియు, కొందరిని విచారణలేకుండ నిర్బంధమునందుంచుటకు కారణమిదియేయనియు, ఇకముందుగూడ నిరోధకమార్గముగా ఇట్టిచర్యలు తీసుకొని అల్లరులు లేకుండ చేయవలెననియు అసెంబ్లీ కోరుచున్నట్లు తీర్మానములో నున్నది.

రహస్యసమావేశము జరుగవలెనని ప్రధాని ప్రతిపాదించినప్పుడు ఆప్రతిపాదనకు సభ్యులు కొన్ని సవరణలు ప్రతిపాదింపదలచిరి. పార్లమెంటు కామన్సుసభకు, పంజాబు అసెంబ్లీకి పోలికలేదనియు, పంజాబు అసెంబ్లీనిబంధనలలో రహస్యసమావేశము జరుపుటకు ఏర్పాటులేదనియు, కాంగ్రెసుపార్టీసభ్యులగు కృష్ణగోపాలదత్తుగారు ఆక్షేపించగా నిబంధనలు రహస్యసమావేశమున కనుకూలముగాగాని, ప్రతికూలముగాగాని, లేవు గనుక నిబంధనల విరుద్ధముగా గాదని అధ్యక్షులు సమర్థించిరి.

ఇట్టిసమావేశము జరుపవలెనని ప్రధానిగారు తెచ్చిన ప్రతిపాదనపై చర్చజరుగుటకు వీలున్నదనియు, సవరణలు తేవచ్చుననియు పార్లమెంటు కామన్సుసభ నిబంధనలకు పంజాబు అసెంబ్లీనిబంధనలకు పోల్యము లేదనియు ముస్లింలీగు సభ్యులగు బరకతాలీగారు కాంగ్రెసువాదమును బలపరచిరి.

"బయటివారు ప్రేక్షకుల గ్యాలరీలోనుండి లేచిపోవలసినదని అధ్యక్షుడే చెప్పినచో సభ్యులీ సమావేశములో జరుగుచర్చలను బయటికిచెప్పుటకు వీలుండెడిది. ప్రధాని ప్రతిపాదనప్రకారము సభవారే రహస్యసమావేశము జరుగవలెనని తీర్మానించుచో అట్టివీలుండదు. ఈనాటి సభాకార్యక్రమము, ప్రభుత్వగ్రంథములోనైనను అచ్చుపడదు." అని కాంగ్రెసుసభ్యులు ప్రతికూల పక్షనాయకులును అగు సంపూర్ణసింగుగారు వివరించిరి.

అధ్యక్షునికిమాత్రమే ఇట్టిహక్కున్నదనియు సభవారుగాని ఇతరులుగాని ఇట్టి ప్రతిపాదనచేయుట క్రమవిరుద్ధమనియు ఇతరసభ్యులు వాదించిరి. అధ్యక్షునివాదముల నంగీకరించలేదు. పూర్వము తాము తెలిపిన నిర్ణయమే ఆఖరుదని తెలిపిరి. ప్రతిపాదనపై చర్చజరుగుటకు వీలులేదనిరి. చర్చలేకుండనే రహస్యసమావేశము జరుగవలెనను ఈప్రతిపాదన ౯౧–౪౭ వోట్లతో నెగ్గెను, తరువాత ప్రేక్షకులను వార్తాలేఖకులను అధ్యక్షులు బయటకుపంపిరి. రహస్యసమావేశము ప్రారంభమయ్యెను. అర్జన్టు మెంటు ప్రతిపాదనకు ఇతరదినము లేర్పాటుచేసి అధ్యక్షులు నేడచ్చుగా ప్రధానిగారి తీర్మానమునుగురించి మాత్రమే చర్చజరుగునట్లుచేసిరి.

రహస్యసమావేశ చర్చలకు సంబంధించిన సంగతులను అధ్యక్షుడే ఒక ప్రకటనరూపముగా వెలువరిచెను.

## భారత స్పిన్నరు అసోసియేషను

అహమదాబాదు, జూలై౧౬

"భారతస్పిన్నర్సు అసోసియేషను కార్యాలయం ఇప్పుడు అహమదాబాదులో వున్నది. ఈ సంఘ ప్రధానకార్యదర్శి శంకరలాలు బ్యాంకరు గారికి జబ్బుగావున్నందున యీసంఘ కార్యాలయము అహమదాబాదునుంచి వర్ధాకు మార్చబడెను. ఇప్పుడు శ్రీకృష్ణదాసు జాజూజీగారు శంకరలాలు బ్యాంకరుగారి స్థానములో కార్యదర్శిగా పనిచేయుచున్నారు. వీరు వర్ధాలోనే నివసించుచున్నారు. ఈసంఘమువారి పరిశోధనల కార్యాలయముమాత్రము అహమదాబాదులోనే వుండును. గనుక పరిశోధనల కార్యాలయానికి లేఖలను వ్రాయదలచినవారందరును యీదిగువఅడ్రెసుకు వ్రాయవలెనని" భారత స్పిన్నర్సు సంఘం వారు ప్రకటించారు.

అడ్రెసు:— సూపర్నెంటుబరు, రీసర్చివర్కుషాపు, ఆలుఇండియా స్పిన్నర్సు అసోసియేషను మిర్జాపూరురోడు, అహమదాబాదు, గుజరాతు జిల్లా. బొంబాయి ప్రెసిడెన్సి

## నగరములో ఆరోగ్యము

హైదరాబాదు(దక్కను) షహరేవరు౧౧

హైద్రాబాదు నగరములో ప్లేగు ఏమిన్ని లేదు. కలరా ౭ కేసులైనవి. ౫ కేసులు అస్పత్రిలో నున్నవి. అందొకడు చచ్చెను. పరిసరగ్రామములలో ౪ కేసులు ౩ చావులు కలిగినవి.

# సుభాష్‌బోసు అరెస్టు

## బెంగాల్ అసెంబ్లీలో అవసరచర్చ

కలకత్తా, జూలై ౧౫

దాదాపు రెండుగంటలసేపు చర్చజరిగిన తరువాత సుభాషుచంద్రబోసు గారి అరెస్టువిషయమై ప్రతిపాదింపబడిన అడ్ జోర్నమెంటు ప్రతిపాదన నేటిసాయంకాలము ౬౭–౧౧౫ వోట్లభేదముచే నిరాకరింపబడెను. కాంగ్రెసుపార్టీ డెప్యుటీలీడరు శ్రీ సంతోషకుమార బోసు గారు ప్రతిపాదనము గావించిరి. కాంగ్రెసుపార్టీ కృషిక ప్రజాపార్టీ, ఇండిపెండెంటు, షెడ్యూల్డువర్గముల పార్టీలు ప్రతిపాదనమునకు అనుకూలముగా వోటుచేసెను. సంయుక్తమంత్రివర్గముపక్షమువారును, ఐరోపియనువర్గమువారును ప్రతిపాదనమును ప్రతిఘటించిరి, కృషిక ప్రజాపార్టీ సభ్యుడొకడు తటస్థముగా నుండెను.

### అడ్ జోర్నమెంటు ప్రతిపాదన

౫–౪౫ గంటలకు శ్రీసంతోషకుమారబోసుగారు సుభాష్‌చంద్రబోసుగారి అరెస్టు, విచారణలేకుండ జైలులోనుంచుట అను విషయమై అడ్ జోర్నమెంటు ప్రతిపాదనము గావించిరి.

### ప్రధానిప్రకటనము

అడ్ జోర్నమెంటు విషయమున ప్రధాని ఫజ్లుల్‌హక్కు గారిట్లు చెప్పిరి:

తనుచే బలవంతముగా తొలగించుట కుద్దేశింపబడిన ఆందోళనమునకు తాము లొంగవలెనాయనునది యిచ్చట విచారణీయము. ఒకసారి లొంగినచో ప్రతిసారి లొంగవలసివచ్చునేమో! సత్యాగ్రహోద్యమము అప్పుడు హాల్వెలు శిలాస్తంభమును తొలగించుటకు ప్రభుత్వమువారు సిద్ధముగాలేరు. బోసు గారియెడల మాకు ప్రేమ, గౌరవము, కలదు. బోసు గారు బెంగాల్ రాజకీయములలో నత్యంతము ప్రేమాస్పదుడగు మహావ్యక్తి. కాని దేశములో శాంతపరిస్థితులను నెలకొల్పి యుద్ధపర్యవసానమునకు, దేశరక్షణకు ప్రభుత్వమువారు తమసర్వశక్తులను వినియోగింపవలసివచ్చుటచేత బోసుపై తాముచర్య తీసికొనక తప్పినదికాదు, బోసును విడుదలచేయుటకంటె మాకుసంతోషకరము మరియొకటియుండదు. కాని మొదట సత్యాగ్రహము ఆపవలెను. ఈసమస్యను శాంతముగా, నిష్పక్షపాతముగా విచారించుటకు తగిన వాతావరణము దేశములోనుండవలెను. అప్పుడు ప్రభుత్వమువారు సభయందలి వివిధపార్టీనాయకులతో నొకసభచేసి, సత్యాగ్రహము ఆపివేయబడినతరువాత సరసమగు కొద్దికాలములోనే నిర్ణయము గావింతురు. ప్రభుత్వమువారి నిర్ణయము అందరికిని సంతృప్తికరముగా నుండునని నేనెరుగుదును.

### అబ్దుల్‌రహమాన్ సిద్దికీగారు

ప్రధాని సానుభూతితో ప్రకటించెను. గనుక ప్రభుత్వప్రతిపక్షనాయకుడగు శరత్ బాబు గారు బోసుగారిని ప్రోత్సహించి సత్యాగ్రహ మాపునట్లు చేయవలెనని సంయుక్తమంత్రివర్గము పార్టీ ప్రముఖుడును, కలకత్తా మేయరును అగుఅబ్దుల్ రహమాన్ సిద్దీకు గారు చెప్పిరి.

### శరచ్చంద్రుని ప్రత్యుత్తరము

ప్రభుత్వ ప్రతిపక్ష నాయకుడగు శరచ్చంద్రబోసు గారిట్లుచెప్పిరి:

ప్రధానిచేసిన ప్రకటనయొక్క అర్థము విషయమై కాంగ్రెసుపార్టీ సభ్యులలో నేకాభిప్రాయములేదు హాల్వెల్ స్మారక చిహ్న శిలాస్తంభమును తొలగించుటకు సత్యాగ్రహము ఆటంకముగానున్నదని ప్రధాని అర్థముకుచో యిచ్చటనే నేను నిర్ణయము గావించుట నావిధ్యుక్తమని తలతును. కాని ప్రధానిచెప్పినయభిప్రాయముయొక్క అర్థమేమో ఆయన స్పష్టముచేసినగాని నేను నిర్ణయము గావింపను.

### మైలుసుగారు

బోసుగారు ఉపయోగించిన కొన్ని వాక్యములను పురస్కరించుకొని మైలుసుగారిట్లుచెప్పిరి: "హాల్వెల్ శిలాస్తంభమును తొలగించి, బ్రద్దలు గొట్టవలెనని బోసుగారనిరి, తొలగించుటకు మాకుఆక్షేపణయుండదు. బ్రద్దలుకొట్టుటకు మేమెంతమాత్రము అంగీకరింపము.

### ప్రధాని మౌనము

బోసుగారడిగిన ప్రశ్నకు ప్రధాని సమాధానము చెప్పలేదు.

ప్రధానిగాక దాదాపు ౧౨ మంది, వివిధ పక్షములవారు చర్చలో పాల్గొనిరి.

ప్రధాని శరచ్చంద్రుని ప్రశ్నకు ప్రత్యుత్తరమొసంగకపోవుటచేతనే ప్రభుత్వ ప్రతిపక్షమువారు చర్చ అపవలెనని ప్రతిపాదించిరి. వోటు జరుగగా ౬౭–౧౧౫ వోట్లచే ప్రతిపాదన నిరాకరింపబడెను.

# జీవదయాసంఘము

హైదరాబాదు(దక్కను)షహరేవరు౧౫

జంతువులయెడ క్రూరతను నివారించుటకై యస్. పీ. సీ. ఏ. అను పేరుతో నొకసంఘము హైద్రాబాదునగరములో కలదు. దానిఅధ్యక్షులు నవాబ్ సాలార్జంగ్ బహద్దరుగారు క్రాఫ్టన్ గారి భార్య దాని కార్యదర్శిని. గురువారము, నాడు ఈసంఘమునకు క్రొత్తగా ౧౪౦౦౦ రూపాయల సర్కారుసైకంతో కట్టబడిన నూతనభవన ప్రారంభోత్సవము శ్రీబిరారు యువరాజాగారిచేత కావింపబడెను. నవాబ్ సాలార్జంగు బహద్దరు సంఘాభివృద్ధినిగురించి సంగ్రహముగా వివరించెను. ఇప్పుడు సర్కారువారు దీనికి నెలకు ౩౦౦ రూపాయిలిచ్చుచున్నారని తెలిపిరి. ఏటేట సుమారు ౧౦ వేల పశువులకు చికిత్సచేయుచున్నామని తెలిపిరి. తర్వాత శ్రీయువరాజాగారు తమ ఆనందమును ప్రకటించుచు సంఘాభివృద్ధిని కోరి ఆశీర్వదించుచు బంగ్లాను తెరచిరి, తర్వాత ఉపహారవిందుజరిగెను. తర్వాత పోలీసునెంబరు వారు శ్రీవారికి జయకారములిచ్చిరి. వచ్చినవారందరును జయజయధ్వనులుచేయుచుండ శ్రీయువరాజులుంగారు వెళ్లిపోయిరి.

# ఎరుకలవారి సత్యనిరూపణము

## వుడుకునూనెలో చేయిపెట్టుట

రేపల్లె, జూలై ౧౫

కొల్లూరుగ్రామములో బహుకాలమునుంచి కాపురముగాయున్న ఎరుకలసంఘీయులలో తట్టా ఘంటడుకు రాముస్వామి అనేవానికి పిత్రార్జితసంబంధమైన బాకీ రు౫–౦–౦లను ఇవ్వవలెనని అడుగగా బాకీదారైన రాముస్వామి తీసుకొని చెల్లించవలసిన బాకీని లోగడ మావాళ్లే ఇచ్చినారని చెప్పినమీద వారిఉభయులకు బాకీనిగురించి కొంతచర్చజరిగెను. పిమ్మట వారికులాచారము ప్రకారం ఇదితేల్చుకొనుటకుగాను గ్రామములోని పెద్దలను వారి సంఘపెద్దలను నిర్ణీతప్రదేశమునకు ఆహ్వానించి ఒకపెద్ద బానలిండా నూనెపోసి క్రింద కట్టెలుపెట్టి నూనె మాతలు క్రాగునట్లుగా కాగినమీదట ఉభయులు స్నానముచేసి వారి కులదైవమును ప్రార్థించి కొబ్బరికాయలనుకొట్టి బాకీదారైన రాముస్వామి తెంటనేతన కుడిహస్తమును మోచేతివరకు నూనెలోపెట్టితీసెను. వానిచేతికి రేవిధమైనప్రమాదం కలుగకుండా మామూలుగానేయుండెను. వెంటనే తన బాకీయున్నదనికోరిన తట్టాఘంటడు రాముస్వామికి అందరిసమక్షములో అపరాధముక్రింద రు ౧౨౦ ఇచ్చెను. వచ్చినప్రముఖులందరుకు సత్యనిరూపణకు ఆశ్చర్యమునుపొంది సత్యనిరూపణమునుగావించిన శ్రీరామస్వామిని పూలమాలికలతో నలంకరించి మేళతాళములతో పెద్ద బ్రహ్మాండమును గావించిరి. యీ ఉత్సవములో కొన్నివందలమంది పాల్గొనిరి.

(ఆంధ్రపత్రిక)

# రష్యాప్రభుత్వ పంచవర్ష ప్రణాళిక

మాస్కో, జూలై౧౪

రష్యాప్రభుత్వము దేశాభ్యుదయకార్యములకు ౫సంవత్సరముల కార్యప్రణాళికను ఇదివరలో రెండుపర్యాయములు అమలుపరచియుండెను. ఇప్పుడు మూడవపర్యాయముగూడా మరియొకపంచవర్ష కార్యప్రణాళికను సంకల్పించి ౭౦ లక్షల రూబుల్సుఋణము గావలెనని ప్రకటింప,౧౧ దినములలో ప్రజలవద్దనుండి కోరిన మొత్తముకంటె హెచ్చుగా ౧,౦౪౦ వేలు రూబుల్సు ఇచ్చుటకు ప్రజలు సిద్ధపడిరి.

## దేశరక్షణ చట్టం క్రింద అరెస్టులు శిక్షలు

కలకత్తా, జూలై ౧౫.

బి.బి.సి.ఐ. రైల్వే ఉపాధ్యాయుడు రియాజు అలంగారిని నిన్న అజ్మీరులో అరెస్టు చేసిరి.

చిటగాంగుజిల్లా కార్మికసంఘ సహాయ కార్యదర్శియున్ను, బెంగాలురాష్ట్రీయ కాంగ్రెసు సంఘసభ్యుడున్నూ విడుదలచేయబడిన డిటెన్యూయున్నూ అయిన సుఖేందు దస్తిదరు గారికి ౧౮ నెలలు కఠినశిక్ష వేయబడెను, ౧౯౪౦ ఏప్రిలులో యితనికి పంపబడిన నిరోధాజ్ఞను యితడు ఉల్లంఘించినందుకు అదనముగా ఒక సంవత్సరము కఠినశిక్ష వేయబడెనుగాని రెండుశిక్షలను యేకకాలము లోనే అనుభవించవలెనని మేజిస్ట్రేటు ఆజ్ఞాపించినందున్న మొత్తము ౧౮ నెలలు మాత్రమే యితడు శిక్ష ననుభవించవలెను. తక్కిన ౧౧ మందికి ఒక్కొక్క సంవత్సరము కఠినశిక్ష వేయబడెను. వీరిలో కాంగ్రెసువర్కరులును, విద్యార్థులును, సైతునాయకులును, రైతులును వున్నారు.

పాలకొల్లు, జూలై ౧౬.

కామ్రేడ్ అల్లూరి సత్యనారాయణగారు. మార్చి నెలనుంచి జిన్నూరుగ్రామములో నిర్బంధములోవున్నారు. నేడు పాలకొల్లు పోలీసు ఉద్యోగులు శ్రీ సత్యనారాయణగారిని అరెస్టులో వుంచిరి.

మునగాల జూలై ౧౫

నేడుఉదయం ౭ గంటలనుండి మధ్యాహ్నము ౨ గంటలవరకు మునగాలలో పోలీసువారు సోదాలు చేసిరి. శ్రీ పర్వతుల సూర్యనారాయణ, మహీధర సూర్యనారాయణ, గోపరాజు లక్ష్మీనరసింహం, మిక్కిలి సూర్యనారాయణ గార్ల యిండ్లను, అవంతి ప్రెస్ ఆఫీసును, విశ్వసాహిత్యమాల ఆఫీసును సుమారు ౭ గంటలకాలము వెతికిరి. కాని వారికి యేమీ దొరకలేదు.

రాజోలు సర్కిలు యినెస్పెక్టరుగారు పోలీసు లతోసహా ౧౫–౭–౧౯౪౦ తేదీనే మధ్యాహ్నం కామ్రేడ్ మహంకాళి రావు గారిమీద వారంటుతోవచ్చిరి. కాని వారు దొరకనందున మరలిపోయిరి.

పరస్వతుల సోమేశ్వరరావుగారిని ౧౪–౭–౧౯౪౦ రాత్రి ౧౦ గంటలకు రాజోలులో శ్రీ పండిత రామ్మూర్తి ప్రెస్ ఆఫీసులో అరెస్టు చేసిరి. ప్రస్తుతం రాజోలు సబుజెయిలులో నుంచిరి.

ఏలూరు, జూలై ౧౬.

ఏలూరుజిల్లా కాంగ్రెసు సోషలిస్టుపార్టీకి కార్యదర్శిగావుండి యిప్పుడు ఏలూరు జూటుమిల్లుల కార్మికుల సంఘానికి అధ్యక్షుడు గావున్న గారపాటి సత్యనారాయణ గారిని నిన్న సాయంకాలము ఏలూరులో అరెస్టు చేసిరి. కాలపరిమితి లేకుండ వారిని నిర్బంధములో వుంచునట్లు ఆర్డరులో వున్నది. ౧౯౪౦ ఏప్రిలునెలలో సత్యనారాయణగారిని పెనపాడులో బంధించియుంచిరి. వీరికి ఆరోగ్యము సరిగా లేనందున దొరతనమువారి అనుమతిపొంది చికిత్సనిమిత్తము వీరు మూడు రోజుల క్రితము ఏలూరు వచ్చిరి. నిన్న మెయిలు ట్రెయినులో సత్యనారాయణగారిని యేలూరునుంచి వేలూరు జయిలుకు తీసుకొని వెళ్ళిరి.

మదరాసు, జూలై ౧౩

౧వ సర్కిలు కాంగ్రెసు కమిటీ సభ్యుడు, మదరాసు కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యవర్గ సభ్యుడునగు శ్రీ వి. యం. సభాపతిగారు నిన్న అరెస్టుచేయబడిరి.

మదరాసు ముద్రణాలయపు పనివారల యూనియను సభ్యులు శ్రీ యస్. చెంగల్వరాయడు శ్రీ జో చెంగల్వరాయడు అనువారుకూడా నిన్న ఉదయము చాకలపేటలో వారి నివాసముల యందు అరెస్టుచేయబడిరి.

కలకత్తా, జూలై ౧౫.

రద్దయిన బెంగాలురాష్ట్రీయ కాంగ్రెసుసంఘ తాత్కాలిక కార్యదర్శి శ్రీ అనిలచంద్ర రాయ్ గారు నేడుఉదయము అరెస్టుచేయబడి, ప్రెసిడెన్సీ జెయిలుకు తీసికొనిపోయిరి,

రంగూనులో "స్వతంత్రన్" అను తమిళ దిన పత్రిక సంపాదకునిమీదను చట్టప్రకారము కేసు తెచ్చుచున్నారు. సంపాదకులగు డేవిడుగారు ప్రజలలో భయముపుట్టొల్పు బర్మానాడు అను వ్యాసము వ్రాసిరట. ప్రధానసంపాదకులగు సుందర మొదలియారుగారు ముస్లింలీగును దూషించు వ్యాసము వ్రాసిరట.

గుంటూరు, జూలై ౧౫

గుంటూరులోని యుద్ధప్రచారసంఘమువారు స్వరాజ్యమైదానములో బహిరంగ సభజరుపుచుండగా, కొన్ని యుద్ధవ్యతిరేక ప్రచార కరపత్రములను పంచిపెట్టినారను నేరము క్రింద నిన్న నం. జి. సూర్యనారాయణ పి. వి, యల్. నరసింహారావుగార్లను గుంటూరుటౌను పోలీసువారు అరెస్టుచేసి జైలులోనుంచిరి.

## జోధ్‌పూర్ గుడ్డి దర్బారు

రాజపుటానాలో జోధ్‌పూర్ ముఖ్యమైన సంస్థానము. ఉత్తరమున బికనీరు—పశ్చిమ పాలన్‌పూరు, జైసాల్మీర్, దక్షిణమున శిరోహీ—తూర్పున ఉదయపూరు ఉన్నవి. జోధ్‌పూరు విస్తీర్ణం ౩౬,౧౨౧ చతురపుమైళ్లు జనసంఖ్య ౨౧,౩౪,౮౪౮ మంది. సంస్థానపు ఆదాయము సంవత్సరమునకు ౧౫౬,౭౮౬౭౦ రూపాయలు; ప్రభుత్వమునకు రు. ౨౧౩౦౦౦ కప్పం కట్టుతున్నారు.

జోధ్‌పూరు దర్బారుయొక్క అధికారము సంస్థానంలో ౧౦౦కి ౧౭ వంతు భాగంపైననే మిగిలిన ౮౩–వ వంతుభాగం ౧౩౦౦ మంది చిన్న చిన్న జమీందారులచే వారి ఇచ్చానుసారంగా పరిపాలింపబడుతున్నది.

మంత్రులు ఏడుగురు ఏడుగురిలో ఒకరో ఇద్దరో తప్పమిగిలినవారందరూ సంస్థానమునకు సంబంధించినవారు కారు.

సంస్థానంలో అన్నిపుద్యోగాలలోనూ బ్రిటిషువారున్నారు, ౮౦ యేండ్లుగా బ్రిటిషువారే యీసంస్థానాన్ని పరిపాలించుచున్నారంటె అతిశయోక్తి కాదు నామరూపమాత్రాలకే రాజు

పూర్వచరిత్ర

౧౯౦౩ సంవత్సరంలో సర్దార్ సింగు మహారాజా గారిని ప్రభుత్వంలో ఉంచి వారే పరిపాలించిరి. ౧౯౧౧ లో సర్దార్ సింగు చనిపోయెను. సుమర్ సింగు మైనర్ గ నుండినందువల్ల పరాయివారే పరిపాలించిరి. ౧౯౧౮ లో సుమర్ సింగు చనిపోయెను. తరువాత ప్రతాపసింగు ౧౯౨౩వ సంవత్సరమువ సింహాసనము ఎక్కువరకు, వీరిచేతుల్లోనే ప్రభుత్వం ఉండెను.

స్వేచ్ఛ

పత్రికలుగాని, పుస్తకాలుగాని సంస్థానంలోనికి రాకూడదు. ప్రైవేటుగా మీటింగు కావలసియుంటే లైసెన్సు పొందవలసియుండును. మొన్న మొన్నటివరకు "హిందూ" పత్రిక స్టేటులోకి రానివ్వకుండా చేసిరి. ఇకమిగతా పత్రికలవిషయం చెప్పేదేమి?

క్షామము

౪ యేండ్లుగా వానలులేక జనం తిండిలేక బాధపడుతున్నారు. ౨౭ లక్షల పశువులలో ౧౦ లక్షలు మేతలేక అప్పుడే చనిపోయినవి ౩ లక్షలమంది జనం, ౫ లక్షల పశువులు సంస్థానం విడిచి వెడలిపోయిరు.

క్షామ నివారణమా?

సంస్థానం క్షామనివారణకోసం ౬౦ లక్షలు గ్రాంటుచేసినారు. జమీందారులు ౧౩౦౦ మంది ఉన్నప్పటికీ, క్షామనివారణకోసం ఒక్కరూ పైసా ఇవ్వలేదు. వారి దగ్గరనిలువచేసుకొన్న ధాన్యాన్ని ఎక్కువధరలకు రైతులకు అమ్ముతూ, లాభం పొందుతున్నారు.

ఈ ఫామిన్ ఫండ్ (క్షామనిధి) మొత్తములో నుంచే ఫామిన్ ఉద్యోగస్తుల జీతాలు, అలవెన్సులు కర్చుపెట్టాలి. అంటే రైతులకుగాను కర్చుపెట్టేది సున్న. సంస్థానంవారు ఏర్పాటుచేసిన డిపోలలో ౬౫౦౦౦ పశువులకు చాలినంత మేత ప్రస్తుతం ఉన్నది. ఇక ౫ లక్షల పశువుల సంగతి యేంకావాలో దేవుడే విచారించాలి.

లోకపరిషత్తు

లోకపరిషత్తు ౧౯౩౮ మే ౧౯౩౮ లో స్థాపింపబడినది. రాజా దీనికి కర్తకర్త. లోకపరిషత్తుకు ౩౭ బ్రాంచీలు ఉన్నాయి. ౨౫౦౦ మెంబర్లు ఉన్నారు. ౨౫ మార్చి ౧౯౪౦ నుండి లోకపరిషత్తును సర్కారువారు బహిష్కరించారు. లాటీచార్జీ నిత్యపూజయైనది.

సంస్థానంలో మంచిపలుకుబడిగల జైనారాయణ వ్యాసుగారిని ఊరినుండి తరిమివేశారు. 'రాజభక్త దేశ హితైషిని సభ' అనిమరి వొకటి ఏర్పాటుచేశారు. ౨౮ మార్చి ౧౯౪౦ స్టేటు ఉత్తరువు ౨౮–౧౯౩౭ ప్రకారం లోకపరిషత్తును బహిష్కరిస్తూ, ప్రజాసంఘాన్ని నిర్మూలం చేయాలని తయారైనారు.

సంస్థానం లోకపరిషత్తుమీద విరగబడింది. ఏప్రెల్ ౨వ తారీఖు మాథుర్‌దాసు గారిని అరెస్టు చేశారు.

ఘట్వాని గారి ముసలితండ్రిని కొక్కుమ ఊడ్చి నట్టు రోడ్డులో యీడ్చి కొట్టారు.

మీటింగులమీద చూస్తూవున్నవారిని చావబాదారు. ఎక్కడపడుతే అక్కడకన్నడం జరుగుతూయున్నదట. బజారులన్ని మూతలు పడినవట జోధ్‌పూరు గుడ్డిదర్బారులో ఈలా జరిగివున్నవి.

—ప్రజా మిత్ర

తణుకు, జూలై ౧౩

కాంగ్రెసుబోర్డు సభ్యులగు శ్రీ యర్రమిల్లి వరసింహారావుగారిని తణుకుపోలీసువారు ఈనెల ౧౦వతారీఖున అరెస్టుచేసిరి.

## 'హరిజన్,' 'హరిజనబంధు'

ప్రకటన తేదీల మార్పు

పూనా, జూలై ౧౬

"ఇటుపైని గాంధిమహాత్ముడు హరిజనపత్రికకు వ్యాసాలను గుజరాతీభాషలోనే వ్రాయుచలచినందున హరిజన, హరిజనబంధుపత్రికల తేదీలలో మార్పుచేయవలసిన అవసరంకలిగింది. ఇంగ్లీషు హరిజనపత్రిక యిదివరకు శనివారంరోజున వెలువడుతుంది గుజరాతీ హరిజనబంధుపత్రిక యిదివరకు ఆదివారంరోజున వెలువడుతోంది. ఇది యిటుపైని శనివారంనాడు వెలువడుతుంది" అని హరిజనపత్రిక కార్యాలయంవారు ప్రకటించినారు.

## సెలవు దొరకలేదు

హైదరాబాదు (దక్కన్), షహరేవరు ౧౮

శుద్ధఖద్దరు భాండారు సభ గత శుక్రవారము హైదరాబాదు నగరములో జరుగనుండెను కాని పోలీసువారినుండి యేమిన్ని సెలవో నిరాకరణమో యేదో ఒక వర్తమానము రానందున సభను ఆపివేసిరి.

సంవత్సరము చందా
౬ పౌలీ రూపాయిలు
ఆరుమాసాలకు
౩ రూపాయిలు
బ్రిటిషిండియాలో
సం॥చందా
౫–౪–౦ కల్దారు.
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము.

# గోలకొండ పత్రిక

# Golkonda Patrika

The only Popular Paper That reaches The masses In the Dominions

Best Medium for Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

*Volume* **15** | **Hyderabad-Dn.** | **Monday 22 July 1940** | ***Number* 23**


## యుద్ధవార్తలు

(మొదటిపేజి తరువాయి)

ఇప్పుడు స్థిరముగా జర్మనులవశములోనివిక్రాగల దు. స్వీడను ఇట్లు : నుమతించుటస్వీడను తాటస్థ్య మునకు విరుద్ధమని బ్రిటిషుప్రభుత్వమువారు స్వీడను ప్రభుత్వమునకు తమఆక్షేపణను తెలియజేసి నారు. ఇప్పుడుపరాశిచిత్తగించి లండనులోనున్న నార్వే ప్రభుత్వమువారు స్వీడను ప్రభుత్వచర్య యెడ తమఆక్షేపణను తెలియబరచినారు.

## హిట్లరుగారి ఉపన్యాసము

అన్నిటిలోను ముఖ్యమైనది హిట్లరుగారి ఉపన్యాసము. జర్మను శాసనసభయగు రీష్‌టాగ్ జూలై ౧౯వ తేదినాడు సమావేశమైనపుడు హిట్లరుగారు నార్వేదాడిమొదలు ఫ్రాన్సుఅపజయ మువరకు జరిగినయుద్ధకథనంతయు తెలియబరచి, ముందుగలిని చెప్పిరి. ఈయుద్ధములో ఇంతవరకు జర్మనీకి కలిగిననష్టములుచాల తక్కువఅనియు, పశ్చిమరంగములో దాడివెడలినప్పటికంటె ఇప్పుడు ఎక్కువఅవసర సామగ్రి సేనలకున్నదనియు; బొగ్గు, ఇనుములుఅపారముగానున్నదనియు చెప్పిరి. ౬౦౦౦ లక్షలమంది సైనికులున్నారనిరి. యుద్ధమెంతకాలముసాగినను ఆహారసామగ్రి సరిపోగలదనిచెప్పిరి.

యుద్ధము ఏగతిని నడచుచున్నదిమున్ముందుగా తెలిసికొని యుద్ధమువాని సంధికి అంగీకరించవల సినదని తానెంతచెప్పినను బ్రిటను, ఫ్రాన్సులు పోషణచేయుచు వినకపోయినవనియు, ఫ్రాన్సు దానిఫలి తమనుభవించుచున్నదనియు, బ్రిటనులో ఇప్పుడు రాజకీయనాయకులు ఇంకను యుద్ధము కొనవరకుసాగింతుమనుచున్నారనియు చెప్పిరి. చర్చిల్‌గారు జర్మనీలో సైనికప్రాముఖ్య ప్రదేశములపై బాంబులు వేయుచున్నామనుచు సామాన్యప్రజలపై బాంబులువేయించుచున్నారనియు, దీనికి ఇంతవరకును ప్రతిక్రియచేయుటకు తానాజ్ఞాపించలేదనియు, కాని తనజవాబు ఎప్పుడో ఒకప్పుడు రావలసినదనియు అప్పుడు బ్రిటిషుప్రజలు అపారమైన కష్టములను అనుభవించగలరనియు, ఆనాడు చర్చిల్‌గారు కెనడాలో నుండగలరనియు చెప్పిరి.

"సామ్రాజ్యము నాశనముగునని నేనుచెప్పుచున్నాను. ఈమాటను చర్చిల్‌గారు నమ్ముచలేను. ఈ పోరాటముసాగినచో అది మాయిరువురిలో ఎవరో ఒకరినాశముతో ముగియవలసియుండునని నాకు తెలుసును. అనాశము జర్మనీకేఅని చర్చిల్‌గారితలంపు. అదిబ్రిటనుకని నాతలంపు. అదిబ్రిటనుకని నాకు తెలుసును. నేను పరాజితుడనుకాను. నేనుదయచూపుడని వేడుకొనుటలేదు. విజయవంతుడనై చెప్పుచున్నాను. ఈయుద్ధము ఇక ఎందుకు సాగవలెనుగనుక! లక్షలకొలది జనుంశిపోలికొవలసియుండు యుద్ధమును మన ముచదలుకొనుట క్షేమకరలెను. చర్చిల్‌గారు ఈనాప్రకటనను ప్రక్కకుత్రోసివేసి, భయములను, జనులకలుదదేహాయను అనుమానములను పుట్టించదిప్రకటనయనవచ్చును. అట్లైనచో ఇకముందుజరుగగల సంఘటనలకు నేను బాధ్యుడ నేనుచుభారము నామనస్సుపై యుండదు.

హిట్లరుగారు తమనాజీఉద్యమమువొక్క ఉద్దేశ్యము వెర్సైల్సు సంధి నిర్మూలనమని చెప్పిరి.

## గాంధి మహాత్ముని శాంతి సైనికదళము

### బార్డోలీలో శిక్షణ ప్రారంభము

గాంధిమహాత్ముడు బార్డోలీలో శాంతిసైనికదళమును ప్రారంభించ సంకల్పించినట్లు అహమ్మదాబాదు పత్రిక యొకటి ప్రకటించినది. ఈశాంతిసైనికులందరు విరతము అహింసాపరులుగా నుందురు. సర్దారుపృథ్వీసింగుగారు దీనికి ప్రధాననాయకులుగ నుందురట దీనికి చేయవలసిన ఏర్పాటులన్నియు పూర్తియైనవి. ఈశాంతి సైనికుల కు శిక్షణ పాఠశాలయొకటి ప్రారంభించబడును.

ఈఉద్యమమును విరివిగా ప్రచారముచేయుటకై "హరిజనబంధు"పత్రికకు మహాత్ముడు అన్నిటిని గుజరాతుభాషలో వ్యాసములను వ్రాయుచున్నారు.

—

తాను ఇంతసహేతుకముగా చెప్పుచున్నమాటను బ్రిటిషుప్రజలు విననిచో లండనును, ఇంగ్లాండును, బ్రిటిషుసామ్రాజ్యమును నాశనముచేయగలమని హిట్లరుగారు బెదరించిరి.

## ఇటలీయుద్ధము

జూలై ౧౫ వ తేదినుండి ౧౯ వ తేదివరకు ఇటలీబ్రిటనుల యుద్ధములో గొప్పవిశేషములేవియు లేవు. సూడాను, అబిసీనియా, ఇరిట్రియాలలో వేలకొలదిమైళ్లదూరము ప్రదేశములలో చిన్నచిన్నపోరాటములు జరుగుచుండెను. ఈజూలై నెలలో ఇటలీసేనలు కాసాలా, కొలాబాదు, కర్మిండులపై తీవ్రమైనదాడులుజేసి క్రొత్తప్రదేశములను పట్టుకొనెను. కెన్యాఉత్తర సరిహద్దువద్ద బ్రిటిషుసేనలు బ్రిటిషువిమానాలతోను కలిసి చిన్నచిన్నదాడులను జూలై ౧౫ వ తేదినాడు ప్రారంభించెను.

జూను ౧౬ వ తేదినాడు ఇటలీసేనలు క్రాప్రుజోలో దూరగుద్దించగా బ్రిటిషుఫిరంగులదెబ్బకు పారిపోవలసివచ్చెను. సోమాలిలాండులో జూలై ౧౫ వతేదిరాత్రి గాఖర్ వద్ద ఇటలీసేనపైకి బ్రిటిషువారిసేనలు దాడిసాగించెను. దానికెదురొడ్డుటకు క్రొత్తఇటలీసేనలురాగా అవి తరిమివేయబడెను.

జూలై ౧౫ వతేది సోమాలిలాండులో దామెరాబాహ్ వద్ద ఇటలీసేనలపై బ్రిటిషుసేనలు దాడి వెడలి నష్టపరచి వెళ్లిపోయెను.

జూలై ౧౭ వతేది కాపుజ్జోవద్ద ఇరుపక్షాలసేనలు పోరాడెను బ్రిటిషుసేనలు శత్రువులకు వష్టముకలిగించెను

ఇంతవరకు లండనిలోనున్న అబిసీనియారాజు ఇప్పుడు సూడానుకువచ్చియున్నాడు.

ఇక మిగిలినవన్నియు విమానాలదాడులవార్తలు ఈవారములరోజులలో విమానాలదాడులకు గురియైనప్రదేశాలు ఇరిట్రియాలోని అస్మాలులో సైనికనివేశనాలు; టోబ్రుక్ లో ఓడలు, మాల్టా నజీరు. బార్దియా, ఎల్గుబా, అల్‌షైరియా, మెరియేలు, సిద్దీబారాన్లి, అస్మారాలో ప్రమానాశ్రయములు, సూడానులో కుర్ముకు, అలెగ్జాంద్రియా, అగోర్డాటు, లిబియాలోని బిరెల్‌బోగివీటిలో మాల్టా, నజీరు, సిద్దీబారాన్లి, కుర్ముక్, అలెగ్జాండ్రియాలపై బాంబులువేసినది ఇటలీవిమానాలు. తక్కినవి బ్రిటిషుబాంబులకు గురియైనవి.

జూలై ౧౯వతేది మధ్యధరాసముద్రములో 'సిడ్నీ' అను బ్రిటిషు నావరెండు ఇటాలీయుల క్రూయిజర్లతోపోరాడి ఒకదానిని ములచివేసెను.

## జర్మనీ, బ్రిటనులపై విమానాల దాడులు

జూలై ౧౫ నుండి ౧౯ వరకు బ్రిటనుపై జర్మను విమానాలును, జర్మనీపైనను, దానివశములోనున్న రాజ్యాలపైనను బ్రిటిషువిమానాలును దాడి వెడలి బాంబులనువేసెను. జూలై ౧౯వతేది జర్మనువిమానాలు బ్రిటిషుసముద్రతీరమునసుండిన ఓడలపై బాంబులువేసెను. ఇంతకంటె విశేషాలు ఏమియులేవు.

### స్పెయిను

స్పెయిను డిక్టేటరు ఫ్రాంకోగారు జూలై౧౭వ తేదినాడు ఉపన్యసించుచు స్పెయినుకు జిబ్రాల్టరుమీద అధికారమున్నది, ఆఫ్రికాలో రాజ్యమున్నుకావలెనని చెప్పిరి.

జిబ్రాల్టరునుండి గనిపింద్లలోనలి పిల్లలున్ను, స్త్రీలును వెడలిపోవలెనని ఆజ్ఞ చేయబడినది.

అమెరికాలో చిలీరాష్ట్రమువారు స్పెయిను నుండిపోయిన విప్లవకారులను రక్షించుచున్నారుకాబట్టి చిలీతో రాజకీయసంబంధమును స్పెయిను వదలుకొనినదని స్పెయినుప్రభుత్వము జూలై ౧౭వతేది ప్రకటించినది

### బ్రిటను

బ్రిటనులో యుద్ధమువంభవించుచో ఆప్రాంతములందు అధికారుల ఆజ్ఞల నుల్లంఘించువారలను విచారణచేసి శిక్షించుటకు ప్రత్యేకమైన న్యాయస్థానములను ఏర్పాటుచేయు అధికారమును ప్రభుత్వమునకిచ్చు క్రొత్తఅవసర శాసనము జూలై ౧౬ వ తేదినాడు బ్రిటిషుపార్లమెంటుకామన్సుసభలో ప్రవేశపెట్టబడి రెండు మారులు ఆమోదించబడెను.

—

## 'ఆంధ్రప్రభ' సంపాదకుని రాక

హైదరాబాదు–దక్కను, షహరేవరు ౧౫ మదరాసులో తెలుగుదినపత్రిక 'ఆంధ్రప్రభ' సంపాదకులగు న్యా. నారాయణరావుగారు నిన్నఉదయము ఇక్కడికివచ్చినారు.

—



## అమెరికా

అమెరికాలో డెమొక్రాటిక పార్టీవారి మహాసభ చికాగోలో జూలై ౧౫, ౧౬, ౧౭వ, ౧౮వ తేదీలలో జరిగినది ఈసభలలో ఉపన్యాసములిచ్చిన ప్రముఖులందరును అమెరికా విదేశములకు తమసేనలను, యుద్ధనౌకలను, పంపరాదనిచెప్పిరి. కాని రాజ్యాక్రమణకాంక్షచే దండెత్తి బలప్రయోగము చేయుచున్నవారితో పోరాడు బ్రిటనుదేశమునకు అమెరికాలో శాసనముల ప్రకారము వీలైనంత సహాయముచేయుట మంచిదని చెప్పిరి. మహాసభవారు మరల మూడవసారి అమెరికాఅధ్యక్షునిగ రూజ్వెల్టుగారిని ఎన్నికకు నిలబెట్టుటకు దాదాపు ఏకగ్రీవముగా నిశ్చయించిరి. రూజ్వెల్టుగారిని ఎన్నికకు నిలబెట్టుటకు దాదాపు ఏకగ్రీవముగా నిశ్చయించిరి. రూజ్వెల్టుగారు ఉపాధ్యక్షునిగ వాలెస్‌గారిని నిలుపవలసినదిగ సూచించిరి. కొందరికి వాలెస్‌గారిష్టము లేకున్నను రూజ్వెల్టుగారిని వదలుకొనవలసివచ్చునను భయముతో వాలెస్‌గారినే ఉపాధ్యక్షుని స్థానమునకు అభ్యర్థిగ నిర్ణయించిరి.

ఇట్టినిర్ణయములకుకృతజ్ఞత తెల్పుచు రూజ్వెల్టుగారు ఒకసందేశమును మహాసభకు బ్రాడ్‌కాస్టు చేసిరి. ఈసారిఎన్నికలో ప్రచారముచ తాను పాల్గొనలేకుండదనియు, ఎందుకనగా విదేశములలో క్షణక్షణము పరిస్థితులు మారుచున్నందువల్ల తానునిరంతరము తనఉద్యోగస్థానములో నుండి పరిస్థితులను గమనించుచుండుట అవసరమనియు వారుచెప్పిరి ఇప్పుడు ప్రజాస్వామిక రాజ్యవ్యవస్థలకును నాగరికతకును ఉపద్రవము వచ్చియున్నదనియు అమెరికా అట్టిఉపద్రవమును తనసేనలచే ఎదుర్కొనవలెననియు చెప్పిరి.

ఇప్పుడు అమెరికా ప్రాంతములో యూరపీయ రాజ్యాలకుగల ప్రదేశములపై అమెరికా సంరక్షణర్తగా నీర్పడవలెనను సూచన నొకదానినిగూర్చి అమెరికాలోని అన్నిరాష్ట్రముల అభిప్రాయములును కనుగొనబడుచున్నవి.

డెమొక్రాటిక పార్టీవారు ఎన్నికలలో ప్రజలకుచేసెడి వాగ్దానముకూడ నిర్ణయించబడినది. యూరపు, ఆసియా ఆఫ్రికాలలోని యుద్ధము అమెరికాకు రాకూడదనియు, విదేశయుద్ధములలో అమెరికా చేరరాదనియు, మన్రోసిద్ధాంతమును నిక్కర్షగా పాటించవలెననియు, ఏఏ రాజ్యములు ఒకటిగాచేరినను అమెరికాను ఓడించవేకుండునట్లు అమెరికా, సైనిక, నావిక, విమానికదళము సిద్ధముచేయబడవలెననియు, ప్రజాస్వామికవిరుద్ధములైన చర్యలను నాశముచేయుటకు వీలైనంతపని చేయవలెననియు, ఇతరదేశాలతో మైత్రిగలిగియుండవలెననియు, పరాక్రమణచే బాధపడుచున్న స్వాతంత్ర్యకాంక్షుల దేశములకు సాధ్యమైనంత సహాయము చేయవలెననియు ఈవాగ్దానములో గలదు.

★

## ఒరిస్సాలో కొందరు కాంగ్రెసువారల ద్రోహము

—

ఒరిస్సారాష్ట్రములో అసెంబ్లీలో కాంగ్రెసుపార్టీసభ్యుడగు గోదావరిమిశ్ర గారు నేషనలిస్టుపార్టీవారితో మంత్రివర్గపు ఏర్పాటులో కలియుటకు గవర్నరుగారితో ఒప్పుకొన్నారు. వారితోకూడ ౧౦మంది కాంగ్రెసువారలు చేరెదరని చెప్పబడుచున్నది. ఈ౧౦మంది ఎవరో విచారించవలసినదని ఆకాంగ్రెసు పార్టీనాయకుడగు విశ్వనాథదాసు గారికి కాంగ్రెసుఅధ్యక్షులగు మౌలానా అజాదుగారు తంతిసందేశము పంపినారు. ఆ౧౦మందిపై తగినచర్య గైకొనబడునని అజాదుగారు తెల్పినారు.

—

## అఖిలరాజకీయపక్ష నాయకులసభ

—

కాంగ్రెసు అధ్యక్షునికి

స్వామి గోవిందానందగారి లేఖ

—

కరాచి, జూలై ౧

ఈనెల ౨౫వతేదినుంచి పూనాలో భారత కాంగ్రెసు సంఘాలసభలు జరుగుతాయిగనుక అప్పుడు పూనాలో దేశంలో అన్నిరాజకీయపక్షాలవారున్నూ కలిసి ఆలోచించి కొరతస్వరాజ్యవిధానమును సిద్ధపరచి బ్రిటను దొరతనమువారికి పంపేందుకుగాను దేశంలో అన్నిరాజకీయపక్షాల నాయకులకు ఆహ్వానాలను పంపదగునని సింధుఫార్వర్డ్‌బ్లాకు అధ్యక్షుడు స్వామి గోవిందానందగారు మౌలానా అజాదుగారికి వ్రాసినారు.

—

## హాల్వెల్ సత్యాగ్రహ వార్తలనిషేధము

—

బెంగాలుప్రభుత్వమువారు హాల్వెల్ స్మారకచిహ్నమును తీసివేయవలెనని చేయుచున్న ఆందోళనకు సంబంధించినవార్తను దేనినిగాని ప్రకటించరాదని ఆజ్ఞాపించుటవల్ల, ఈ ఆజ్ఞవల్ల ప్రాథమికస్వత్వములలో నొకటియగు ప్రజాభిప్రాయ ప్రకటనహక్కు ప్రభుత్వమువారిచే తొలగించ బడినట్లగుచున్నదని విమర్శించుటకై జూలై ౧౭ వ తేదినాడు బెంగాలుఅసెంబ్లీలో కర్షకప్రజాపక్ష సభ్యుడగు జలాలుద్దీన్ హాష్మిగారు ఆక్షేపణ మెంటు ప్రతిపాదన చేసిరి.

సత్యాగ్రహము ప్రారంభించినాంటనే విద్యార్థులాందోళనకూడ రేగునుకాబట్టి, దానినాపుటకై సత్యాగ్రహము సాగకుండ అన్నికట్టుదిట్టములను చేయుట అవసరమయ్యెననియు, అందుచే హాల్వెల్ సత్యాగ్రహవార్తలుకూడ నిషేధించబడెననియు బెంగాలు ప్రభుత్వ ప్రధానమంత్రి సమాధానమిచ్చెను.

రెండుగంటలచర్చతర్వాత తీర్మానము ౧౨౫–౭౭ ఓట్లచే నిరాకరించబడినది.

—


Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press. Hyderabad Dn, Editor- S. Prathapa Reddy B. A. B. L.